# పరలోకం - పునర్జన్మ



आत्मानग्ं रथिनं विद्धि शरीरग्ं रथमेव तु ।
बुद्धिं तु सारथिं विद्धि मनः प्रग्रहमेव च ॥ क.उ ॥

నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# స్వవిషయం

ఏ పనిచేయాలన్నా ఏదోఒక ప్రేరణ ఉండాలి. ఒక మాటగానీ, ఒక సంఘటన గానీ, ఒకదృశ్యం లేదా సన్నివేశంగానీ ప్రేరణకు కారణం కావచ్చు. ఈ చిన్నపుస్తకం వ్రాయటానికి ప్రేరణకు మనవిచేస్తాను. నా 72 సం॥ల జీవితంలో, చాలా దగ్గరగా ఉండి, మాతాతగారు, తండ్రి, తల్లి, అన్నగారు, వియ్యంకులు, ఇట్లా చాలామంది బంధువులు, ఆప్తులు అయినవారి మరణాలను చూచాను. వారికి జరిగిన కర్మకాండలను చూచాను. వీరంతా ఆరోగ్యంగా తిరుగుతూనే అనాయాస మరణాన్ని పొందారు. వీరి మరణానంతర కర్మకాండ లను చూచినప్పుడు నాలో చెలరేగిన ఆలోచనలే ఈ రచనకు ప్రేరకాలు.

వార్ధక్యంవల్ల కొందరు, రోగబాధలతో కొందరు, ప్రమాదాలలో కొందరు, ఆత్మహత్యల రూపంలో కొందరు ఇట్లా నిత్యమూ అనేకమంది మృత్యువు వాతబడటం మనం చూస్తున్నాం. కాస్సేపు బాధపడి, వెంటనే ఆ విషయం మరచిపోతున్నాం. అట్లాగే నిత్యమూ అనేక జననాలను చూస్తున్నాం. కాస్సేపు, జననానికి సంతోషిస్తున్నాం. కాని ఈ జనన మరణాలను గూర్చి దీర్ఘంగా ఆలోచించం. అట్లాగే, మనకండ్ల యెదుట అనేకమందికి జరిగే దహన సంస్కారాదులను చూస్తున్నాం. కాని వాటిని గురించి లోతుగా ఆలోచించటంలేదు.

ఈ అంత్యక్రియల్లో, సాంప్రదాయాల్నిబట్టి, శాఖాభేదాన్నిబట్టి, వర్ణవ్యవస్థ ననుసరించి ఏ కొద్దిభేదాలో తప్ప, ప్రధానమైన కర్మకాండ హిందువు లందరికీ ఒకటిగానే ఉంటోంది. వేదోక్తమైనా, పురాణోక్తమైనా, మరేదైనాసరే,

ఆయావిధుల ఉద్దేశ్యమూ ఒకటే ! అగ్ని సంస్కారమైనా, ఖనన సంస్కారమైనా ఒకటే ! అన్ని మతాల్లోనూ ఈ అంత్యక్రియలు ఏదో రూపంలో జరుగుతున్నాయి. వీటి మూలంలో ఉన్న విశ్వాసం మాత్రం ఒకటే !

ఈనాడు, ఆంగ్లవిద్య నభ్యసించి, ఉద్యోగ వ్యాపారాల్లో తలమునకలై యుండే వారు సైతం, ఆస్తిక్యబుద్ధితో ఈ విధి విధానాల యెడల ఎంతో భక్తి విశ్వాసాలు చూపిస్తున్నారు. వారే ఎక్కువ భక్తి శ్రద్ధలతో ఉన్నారన్నా అశ్చర్యం లేదు. పరిస్థితులనుబట్టి శాస్త్రోక్త పద్ధతులతో చేయలేకపోతున్నామని లోన బాధపడుతున్నారు. మనుస్మృతి లాంటి ధర్మగ్రంథాల్లో పితృకార్యాల విషయమై చెప్పబడిన విధినిషేధాదులను చూస్తే వారికి మతిపోయినంతపని అవుతుంది. వారు డబ్బు ఖర్చుకు వెనుకాడటంలేదు. పుష్కరాలలాంటి సందర్భాల్లో పితృకార్యాల యెడల వారికున్న శ్రద్ధాభక్తులు మనకు స్పష్టంగా గోచరిస్తాయి. కాలాన్నిబట్టి సాంఘిక పరిస్థితుల్లో వచ్చిన మార్పులకు, ఈ విధి నిషేధాలకూ పొంతన కుదరటం లేదు. పండితులు, పురోహితులు, పెద్దలు, వీలైనంతవరకు, తమకు అనుకూలంగా ఉండే పద్ధతిలో, తమ పనినితాము చక్కబెట్టు కుంటున్నారు. కర్తకు మాత్రం డబ్బు వదలినా, శ్రమకలిగినా, మానసికంగా మాత్రం తృప్తి ఉండటంలేదు. ఎందుచేత? ఈ కర్మకాండలకు సంబంధించిన జ్ఞానం లేకపోవటం వల్ల ! శాస్త్రాల్లో చెప్పబడిన విషయాలకు, వాటినిబట్టి చేసే క్రియలకు, కళ్లముందు జరిగే తంతుకు, పొంతన లేదు. ఇవన్నీ ఆలోచనను రేకెత్తించే విషయాలే! ఇక అసలు విషయానికి వద్దాం!

పాఠకులకు ఈవిషయమైన అవగాహన కలిగించే తలంపుతో విషయాన్ని రెండు భాగాలుగా విభజించి, మొదటిభాగంలో మృత్యువు, పరలోకం, పునర్జన్మ మొదలైన విషయాలను వేదశాస్త్రాల్లో చెప్పబడిన విధంగా వివరించటం జరిగింది. రెండవ భాగంలో ప్రస్తుతం హిందూ సహజంలో జరుగుతున్న అంత్యక్రియలను గూర్చి వివరించటం జరిగింది.

**– నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు**

# ముందుమాట

**చా**రిత్రకంగా చేస్తే వేదమతానికి (భారతీయ, హిందూ మతానికి) విదేశీయ మతశక్తులతో సాన్నిహిత్యంతోపాటు-సంపర్కంతోపాటు, సంఘర్షణలు సంభవించాయి. అయితే, అనంతమైనకాలంలో, మహాసముద్రం లాంటి మన మతం ఆయా విదేశీయ మత విశ్వాసాలను సైతం తనలో కలుపుకొంటూనే వస్తోంది. తనదైన ప్రత్యేకతను నిలబెట్టుకుంటూనే వస్తోంది. ఈకారణంగా, భారతీయుల మతపరమైన విధివిధానాల్లో కర్మకాండల్లో, ఆలోచనా విధానంలో, సంస్కారాల్లో, ముఖ్యంగా ఉపనయన, వివాహ, అంత్యక్రియల్లో చాలా పరిణామాలు సంభవించాయి. ఆచారాలు, విధానాలు, మారినా సంస్కారాలు మాత్రం పూర్తిగా లుప్తం కాలేదు.

ఆంగ్లేయులరాకతో, ఆంగ్లవిద్యా ప్రాచుర్యంతో, పాశ్చాత్య నాగరకతా వ్యామోహంతో, 19వ శతాబ్దారంభం నుండి భారతీయజనజీవనంలో, భావాలలో, ఆదర్శాలలో, సాంఘిక ధార్మిక విధివిధానాల్లో, ఊహించలేనన్ని మార్పులు వచ్చాయి. పాశ్చాత్య నాగరకతా ప్రభావం యువతీయువకులపై అంతులేకుండా పడటంతో ఒక విచిత్రం ఏర్పడ్డది. కొందరు విదేశీయ మత సంస్కృతీ ప్రవాహంలో పడి కొట్టుకుపోగా, కొందరు విదేశీయుల ఆక్షేపాలకూ, వారి వారి వితండ వాద వ్యాఖ్యానాలకూ, తగిన సమధానాం చెపుతూ, వారినోళ్ళు మూయించటానికి ప్రయత్నించారు. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మత స్వాతంత్ర్యకాంక్ష ప్రబలింది. మన శాస్త్రాలకు, శ్రుతులకు సరియైన అర్థంచెప్పి విదేశీయులనే ఆకర్షించారు. సంకుచితమైన అడ్డంకులు తొలగిపోగా, వేదమతం విదేశయాత్రలకు సైతం సిద్ధపడ్డది. మనధర్మశాస్త్రకారులు

నిషేధించిన సముద్రయానం, విధవావివాహం, ప్రౌఢ వివాహం, స్త్రీవిద్యా స్వాతంత్ర్యాలూ, సర్వామోదయోగ్యాలైనాయి. వారు నిషేధించిన అనులోమ ప్రతిలోమ వివాహాదులు జరుగుతున్నాయి. సంఘసమ్మతాలై ప్రోత్సాహానికి పాత్రము లైనాయి.

ఈ సంధికాలంలో మనహిందూ సమాజంలో ఆచరణలో ఉంటూ వచ్చిన షోడశ సంస్కారాల్లో, చిన్నచిన్న సంస్కారవిధులు లుప్తమైపోగా, ప్రధానములైన ఉపనయన, వివాహ, అంత్యేష్టి విధులు మాత్రం కాలాన్నిబట్టి మార్పులు చెందుతూ నిలిచి ఉన్నాయి. ఏదేశంలోనైనా, ఏమతంలోనైనా, తమతమ ప్రాచీనవిధి విధానాల్ని ఆదరించి ఆచరిస్తూనే, అవసరాన్నిబట్టి కాలాన్నిబట్టి, పరిస్థితుల్నిబట్టి, వానిలో తగిన మార్పులు చేర్పులు చేసుకొంటూనే ముందుకు సాగటం కనిపిస్తుంది.

పూర్వం అయిదురోజులపాటు అగ్నిహోత్ర విధులతో సాగిన వివాహ సంస్కారకాండ, మెల్లమెల్లగా 3 రోజులకు, మూడుపూటలకు, మూడు గంటలకు నేడు పరిమితమైంది. 5వ సంవత్సరంలో జరిగే అక్షరాభ్యాసం 3వ సంవత్సరం లోనే తెలుగు అక్షరాలకు బదులుగా, ఇంగ్లీషు అక్షరాలతో, ఎల్.కె.జీతో ఆరంభమౌతోంది. ఉపనయనం లుప్తమైపోగా, కొన్నిచోట్ల వివాహానికి కొన్ని గంటల ముందుగా అయినదనిపిస్తున్నారు. ఋగ్యజుస్సామాదిశాఖల్నిబట్టి, ఆపస్తంబ ఆశ్వలాయనాది సూత్ర ప్రామాణ్యతనుబట్టి, స్మార్తశైవ వైష్ణవాది శాఖల్నిబట్టి ఈ సంస్కార విధుల్లో స్వల్ప భేదాలు కనిపిస్తాయి.

అట్లాగే, అంత్యక్రియలు విధివిధానాల్లో కూడా మార్పులు వచ్చినాయి, వస్తున్నాయి. కాలాన్నిబట్టి, పరిస్థితుల్ని బట్టి, కావలసిన మార్పులు సమాజమే చేసుకుంటుంది. వాటిని స్మృతికారులు, సూత్రకారులు, పండితులు, పెద్దలు ఆమోదించి ముద్రవేస్తారు. వేదాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు, శ్రౌతసూత్రాలు, గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాలు, స్మృతులు, పద్ధతి ప్రయోగ గ్రంథాలు, పురాణేతిహాసాలు, మహాకావ్యాలు, ఇవన్నీవరుసగా, మన సంస్కృతినీ కర్మకాండల చరిత్రనూ తెలియజేస్తున్నాయి. ప్రాచీన గృహసూత్రాలను, ధర్మసూత్రాలను తిరుగవ్రాయాల్సిన అగత్యం ఉంది. మార్గదర్శకులైన పెద్దలు

ఆపనిచేసి, ఆమోదముద్ర వేయాలి. వారట్లా చేయకపోయినా, వారికోసం కాలం ఆగదు. సంఘం తనపని తాను చేసుకుంటూ పోతుంది.

వివాహాది సంస్కారాల్లాగానే, అంత్యక్రియల్లో కూడా, కాలాన్ని బట్టి చాలా మార్పులు వచ్చాయి, వస్తున్నాయి. ఈ విషయమై ప్రాచీన కాలంనుండి వస్తున్న విధులను సంగ్రహంగా వివరించి, చివరలో, కాలపరిస్థితుల్ని బట్టి ఫలానావిధంగా చేస్తే బాగుంటుందని సూచించటం జరిగింది. ఇది సూచన మాత్రమే! ఎవరి విశ్వాసాన్ని బట్టి వారు చేయవచ్చు.

పూర్వకాలంలో మృతశరీరం ఎందుకూ పనికిరాదని అనుకున్నారు. ఈనాడు మృతుని నేత్రాలు ఇద్దరు అంధులకు ఈశ్వరసృష్టి స్వరూపాన్ని చూచే అదృష్టాన్ని కలిగిస్తున్నాయి. అట్లాగే, మూత్రపిండాలు, గుండె వగైరా ఇతర అవయవాలు సైతం ఉపయోగపడే రోజులు వచ్చాయి. మృతశరీరం వైద్యవిద్యాబోధనకు ఉపయోగ పడవచ్చు. కాబట్టి, నేత్రదానాదులు, మృతునికి ఊర్ధ్వలోక ప్రాప్తిని కలిగించవచ్చుననే విశ్వాసం ప్రచారంలోకి రావచ్చు. గోదాన భూదానాదులకంటె మించినది నేత్రదానం. అట్లాగే ధనవంతులు ఒక వ్యక్తికి చేసే దానంకంటె, సాంఘిక ప్రయోజనాలకోసం –వైద్యశాలలు, పాఠశాలలు ప్రయాణీకులకోసం కట్టించే ఆశ్రయాలు వగైరాలకోసం చేసేదానం చాలా గొప్పది గదా!

ఈ దృష్టితోనే ఈచిన్న పుస్తకం వ్రాయబడింది. అంతేతప్ప, భారతీయ విశ్వాసాలమీద చులకన భావంతో కాదు. నాస్తిక హేతువాద దృక్పథంతోనూ కాదు. పాశ్చాత్య విశ్వాసాల మీద మోజుతోసూకాదు. మన విశ్వాసాలను, మనదేశానికీ సంఘానీకీ అనుకూలించేటట్లు మార్చుకుందామనే తలంపుతో చేసినపనే!

భావ ఉగాది

11-4-94

–oOo–

# విషయ సూచిక

**పూర్వార్థం**

1. మృత్యువు అంటే ఏమిటి? 2. మృత్యువు సుఖప్రదమే! 3. మరణించే విధము. 4. శరీర విభజనం. 5. పునర్జన్మ- వేదాల్లో మృతునికి చెప్పబడిన 8 దశలు పురాణాల్లో పరలోకం- పునర్జన్మలను గూర్చి. 6. జీవుని గతులు- పరలోక మార్గాలు. 7. కర్మలు- భేదాలు 8. సారాంశం 9. ఇతర మతాల్లో పరలోకం పునర్జన్మ.

1. విషయప్రవేశం. 2. కర్మకాండలు- కారణాలు. 3. మరణమంటే భయం 4. మృత్యువు తరువాతి జీవితాన్ని గూర్చి. 5. జీవితం మీదప్రేమ. 6. దహన ఖననాదులెందుకు? 7. మృతశరీరానికి చేసే సంస్కార విధులు- వేద ప్రమాణాలు. 8. అగ్నిసంస్కారం- దాని ప్రత్యేకతలు. 9. వేదకాలంలోని అంత్యక్రియలు. 10. దహనానికి ముందు చేసే పనులు. 11. శ్మశానానికి తీసికొని పోయే ముందు జరిగే విధులు. 12. దహనం. 13. విధవను చితిపై పరుండ బెట్టడం. 14. దహన సంస్కారం ఒకయజ్ఞం. 15. ఆస్థి సంచయనం. 16. మరణ పైతృకాలకు దుస్తతిథి వారనక్షత్రాదులు 17. నగ్నశ్రాద్ధం. 18. నవాహ్నిక శ్రాద్ధాలు. 19. నిత్యకర్మ 20. దశాహం. 21. ఏకాదశాహం 22. ద్వాదశాహం. 23. దహన, శ్రాద్ధములకు మినహాయింపులు. 24. సారాంశం 25. పరిమితం కావలసిన విధులు- సూచనలు

# పూర్వార్థం

## 1. మృత్యువు అంటే ఏమిటి? :

రక్తం, మాంసం, ఎముకలు, నాడులు, మొదలైన వాటితో కూడి, నాశనమైపోయే స్వభావం కలిగి, కాళ్ళు చేతులు మొదలైన ఇంద్రియాలతో కూడిన దేహమూ, అనశ్వరమైన (నాశనంలేని) 'ఆత్మ' ఈ రెంటి సంయోగాన్ని– కలయికనూ– జన్మ అనీ, జీవితం అనీ అంటాం. ఈ శరీరానికి ఆత్మకూ ఉండిన సంబంధం తొలగిపోవటాన్ని మృత్యువు అనవచ్చు. అంటే, శరీరంలో కర్తగా, భోక్తగా, ద్రష్టగా ఉంటూ, 'నేను' అని వ్యవహరిస్తూ ఉండిన జీవాత్మ, ఈశరీరాన్ని వదలిపోవటం మృత్యువు అన్నమాట.

అయితే, మనం అజ్ఞానంవల్ల, ఈ జీవనం సుఖప్రదమైనదనీ, మరణం భయంకరమైనదనీ, దుఃఖప్రదమైనదనీ, అనుకుంటాం. ఇది ఒక గొప్ప భ్రమ. మన వేదాంత శాస్త్రమంతా దీనిని గురించే చర్చించింది. 'పుట్టుట గిట్టుట కొరకే' అనే పరమసత్యమైన లోకోక్తి ఉంది. చావు పుట్టుకలు, నాణానికి బొమ్మ బొరుసుల్లాంటివి. పైన పేర్కొన్న శరీరము, జీవాత్మ, ఈ రెంటి సంయోగ వియోగాలతో (జనన మరణాలతో) కూడినదే, ఈ సంసారం– జగత్తు. మనకీ జగత్తులో అనుక్షణం కనిపించేవి, ఈ జనన మరణాలే ! మానవుల్లోనేకాక, సమస్త జీవజంతువుల్లోను, వృక్షాల్లోనూ ఈచావు పుట్టుకలు మనకు కనిపిస్తున్నాయి.

ఈ చావు బ్రతుకులు రాత్రింబవళ్లలాంటివి. చావు రాత్రి అయితే, బ్రతుకు పగలు. పగలంతా పరిశ్రమచేసి, మళ్ళీ పగలు శ్రమిస్తాం. అట్లాగే, ఈ

శరీరంతో జీవించి, కష్టసుఖాలు అనుభవించి, శ్రమవల్ల శక్తి క్షీణించి పోగా, అవయవాలు శిథిలమైపోగా, మరణంతో విశ్రాంతిని పొంది, మళ్ళీ క్రొత్త జన్మను పొందుతున్నాం. దివారాత్రాలు అనేక సంవత్సరాలపాటు సాగినట్లే, ఈ జన్మ మరణాలు కూడా అనేక యుగాలపాటు, అనంతకాలం సాగుతూనే ఉంటాయి. అందుకే, భగవద్గీతలో "గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితా." పండితులైనవారు మరణించిన వారిని గురించిగానీ, జీవించి ఉన్నవారిని గురించిగానీ శోకింపరు' అని చెప్పారు. అంటే జీవన్మరణాలు రెండూ సమానమే!

భగవద్గీతలోనే

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
సనాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ (2-22)

(చినిగిపోయిన వస్త్రాలను వదలివేసి, మానవుడు క్రొత్త వస్త్రాలను ధరించినట్లే, జీర్ణమైన దేహాలను వదలి వేసి, ఆత్మ క్రొత్తవైన దేహాలను గ్రహిస్తుంది.)

అట్లాగే- "జాతస్య హి ధ్రువో మృత్యుః
ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యే ర్థే
సత్వం శోచితు మర్హసి (2-27)

(పుట్టినవాడు చావక తప్పదు. చచ్చినవాడు పుట్టకతప్పదు. కాబట్టి, తప్పనిసరిగా జరగాల్సిన ఈ చావు పుట్టుకలకోసం శోకించటం తగదు) అని చెప్పారు.

నిద్రనుండి మేల్కొంచి, మళ్ళీ పగలంతా పనిచేయాల్సి వస్తోంది గదా అని దుఃఖించటం లేదు. నిద్రపోబోయే ముందు. ప్రతిరోజూ నిద్రపోవాల్సి

వస్తోంది గదా! అనీ దుఃఖించటం లేదు. మరి, జన్మ మరణాల విషయంలో ఆనందం దుఃఖం ఎందుకు కలుగుతోంది? అంటే "ఈ శరీరంనాది, ఈ ఇల్లునాది, ఈ భార్యపిల్లలు నావారు." అనే మమకారం ఏర్పడటంవల్ల! అజ్ఞానం వల్ల ఏర్పడిన ఈ మమకారం, క్రమేణా వృద్ధి చెంది, సత్యాన్ని చూడలేని గ్రుడ్డివారినిగా చేస్తోంది. కాబట్టే వీరందరినీ వదలి పోవలసి వస్తోందనే దుఃఖం కలుగుతోంది.

## మరణాసన్నునికి కలిగే 4 రకాల దుఃఖాలు :

జిగురు చేత బాగా అతికించబడి చిరకాలంగా ఉన్నట్టి రెండు కాగితాలను విడదీయాలంటే చాలాకష్టం. రెండు కాగితాలకూ ఎంతో కొంత కష్టం నష్టం కలుగక తప్పదు. అట్లాగే, మమకారం, అహంకారం చేత బాగా అతుక్కుపోయి రెండూ ఒకటే అని చిరకాలం భావిస్తూ ఉన్నందున జీవాత్మ ఈ శరీరాన్ని వదిలేటప్పుడు చాలా బాధపడాల్సి వస్తుంది. ఆ స్థితిలో జీవాత్మకు 4 రకాల దు:ఖాలు కలుగుతాయని చెపుతారు. 1) విశేషజదుఃఖం 2) మోహజ దుఃఖం 3) అనుతాపజదుఃఖం 4) ఆగామి దృశ్య దర్శనజ దుఃఖం, అని.

మరణసమయంలో అహంకార మమకారాలవల్ల ఒకటిగా బాగా అతుక్కుపోయిన స్థూల సూక్ష్మ శరీరాలు వేరుకావాలి. స్థూల శరీర భారమంతా సూక్ష్మశరీరమే వహించాలి. ఆ స్థితిలో కలిగే క్లేశమే విశ్లేషజ దుఃఖం. తల్లిదండ్రులు, పుత్రులు, భార్య, భర్త, కుమార్తెలు మొదలైన బంధుజనులంతా చుట్టూ చేర విలపిస్తూ ఉన్నప్పుడు, ఇట్టివారిని వదలిపోతున్నందువలన కలిగే దుఃఖం మోహజదుఃఖం. జీవితమంతా తాను పాపాలు చేస్తూ, పుణ్యకార్యాలు చేయనందువలన తనకు నరకం లభిస్తుంది, తప్పదు, అనే పశ్చాత్తాపం వల్ల కలిగే దుఃఖాన్ని అనుతాపజ దుఃఖం అంటారు. మృత్యు సమయంలో జరగబోయే దృశ్యాలు స్పష్టంగా గోచరిస్తాయి. కాబట్టి పాపాత్ములకు తాము చేసిన పాపాలకు అనుభవించబోయే దృశ్యం కళ్ళముందు కనిపిస్తుంది. దానివల్ల కలిగే దుఃఖమే ఆగామిదృశ్య దర్శనజ దుఃఖం. అందుకే జన్మ, జరా,

వ్యాధి దుఃఖాలకంటె, జీవికి మరణ దుఃఖం, ఎక్కువ భయంకరమై ఉంటుంది. ఇదంతా పాపుల విషయం, పుణ్యాత్ముల విషయం వేరు.

## 2. మృత్యువు సుఖ ప్రదమే

బాగా చినిగిపోయి, పీలికలైపోయిన వస్త్రంవల్ల ఏమి ఉపయోగం ఉంటుంది? అది శీతాతప బాధలనుండి రక్షించలేదు గదా ! దానిని వదలి పారేస్తే, క్రొత్త వస్త్రం వచ్చేటప్పుడు ఈ పాతపీలికను పట్టుకొని వ్రేలాడటం ఎందుకు? అట్లాగే, అవయవాలన్నీ జీర్ణము, శీర్ణమూ అయి శక్తిలేక, ఏవిధమైన పనీ చేయలేక, బాధ కలిగిస్తూన్న ఈ శరీరాన్ని వదలి వేరొక క్రొత్త శరీరాన్ని పొందటానికై ఎందుకు దుఃఖించాలి? మనకు జన్మవల్ల వచ్చి, పెరిగి, మమకారాదులచేత పోషింపబడిన ఇంద్రియాలు, భార్య, పిల్లలు, ఇల్లు, ధనం వగైరాలకోసం, జీవితకాలమంతా శ్రమించి, అలసిపోయి, దుఃఖిస్తూ ఆయువునంతా గడుపుతున్నాం. వార్ధక్యంలో, ఇవేవీ అక్కరకు రాకుండా పోతున్నాయి. మన శరీరం, మనజీవితం, మనకు శత్రువుగా గోచరిస్తోంది. మృత్యువనేది ఆ దేహంతో సంబంధాన్ని వదలించివేసి, దుఃఖాన్ని పోగొట్టి విశ్రాంతివస్తుంది. ఈ సత్యాన్ని గ్రహిస్తే, మృత్యువు సుఖప్రదమే అవుతుంది.

ఆజ్ఞానం వల్ల పెంపొందిన స్వార్థం అనేది (మమకారానికే మరొక పేరు స్వార్థం) చనిపోయేవానికీ, వాని పుత్రమిత్ర బంధు కళత్రాదులకూ దుఃఖాన్ని కలిగిస్తోంది. వియోగమనేది తమతమ స్వార్థానికి భంగం కలిగిస్తోంది. కాబట్టి ఏడుస్తున్నారు. అంతేతప్ప. చనిపోయేవాడు భార్యబిడ్డలకోసం, భార్య బిడ్డలు చనిపోయే వానికోసం ఏడపటం లేదు. వారికోసమే వారు ఏడుస్తున్నారు. వారి స్వార్థం కోసం ఏడుస్తున్నారు. ఈ సత్యాన్ని యాజ్ఞవల్క్యుడు, భార్యయైన మైత్రేయితో చెప్పాడు.

న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
అత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి
న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియాభవతి

అత్మనస్తు కామాయ జాయా ప్రియాభవతి
న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియాభవన్తి
అత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి.................

(బృ. ఉ. 4- 4- 6)

ఇట్లా సంపద, పశువులు, మొదలైనవన్నీ అత్మార్థమే - స్వార్థంకోసమే ప్రియమైనవౌతున్నాయి. కాబట్టే వాటిని పొందినందుకు సుఖాన్ని వాటిని వదలుతున్నప్పుడు దుఃఖాన్నీ పొందుతున్నాం. (ఇదంతా అజ్ఞానంవల్ల కలిగినదని చెప్పారు ఈ సత్యాన్ని గ్రహిస్తే చచ్చేవాడూ, ఉండేవారూ) ఇరువురూ దుఃఖించనక్కరలేదు.

మనం ఇంకొక సత్యాన్ని కూడా చూద్దాం. ఎంతకష్టమైన పని అయినా దుఃఖం అయినా, తమంత తాము కోరి అనుభవిస్తే, దుఃఖం ఉండదు. సుఖమే కలుగుతుంది. స్వాతంత్ర్యోద్యమంలో, ఐచ్ఛికంగా జైలుశిక్షను అనుభవించినవారికి ఇటువంటి సుఖసంతోషాలే కలిగినాయి. దొంగతనంచేసి కూనీలుచేసి జైలు శిక్ష అనుభవించేవాడు బలవంతంగా, తన యిష్టానికి విరుద్ధంగా అనుభవిస్తున్నాడు. కాబట్టి దుఃఖం కలుగుతోంది. ఆత్మహత్యలకు పాల్పడేవారుకూడా, వైరాగ్యంవల్ల కాకపోయినా, ప్రస్తుత కష్టాలకంటె శరీరత్యాగమే మంచిదనే నమ్మకంతో, ప్రస్తుత కష్టాలనుండి విముక్తికోసం స్వచ్ఛంద మరణానికి పాల్పడుతున్నారు. అదేపని, ఇతరులకు, చూచేవారికి, భయాన్నీ దుఃఖాన్నీ కలిగిస్తోంది. బలవంతంగా ఎవరైనా హత్యచేస్తే దుఃఖం కలుగుతోంది. ఎందుచేత? తనకు మరణం ఇష్టంలేదు కాబట్టి.

### 3. మరణించే విధానం :

మరణించేటప్పుడు జరిగే క్రమాన్ని శ్రుతుల్లో వర్ణించి చెప్పారు. ఇంద్రియాలు మనస్సులోను, మనస్సు ప్రాణంలోనూ, ప్రాణంతేజస్సులోను, తేజస్సు పరమాత్మలోను లయమౌతుంది. (సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మనఃప్రాణే, ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం) (ఛాందోగ్యం-6-8-6)

బృహదారణ్యకోపనిషత్తు 4వ అధ్యాయం 3,4 బ్రాహ్మణాల్లో జీవాత్మ శరీరం నుండి నిష్క్రమించటాన్ని గూర్చి, పునర్జన్మను గూర్చి చక్కగా వర్ణించారు.

"తద్యథానః సుసమాహిత....ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవతి (బృ. ఉ. 4-3-35)

"బాగా బరువుతో ఉన్నబండి కిఱ్ఱుమని శబ్దంచేస్తూ పోతూ ఉండటం చూస్తూనే ఉన్నాం. అట్లాగే. ఈ శరీరంలోని ఆత్మ, స్వయంప్రకాశమానమైన పరమాత్మచేత ప్రకాశితుడై శబ్దంచేస్తూ వెడతాడు- ఊర్ధ్వశ్వాసతో ఈ లింగశరీరంలోని మర్మస్థానాలను వదలివెళ్ళిపోతాడు."

"స యత్రాయ మణిమానం న్యేతి.....ప్రతియోన్యా ద్రవతి ప్రాణాయైవ" (బృ.ఉ. 4-3-36) అవిద్యాజన్యమైనట్టి. హస్తపాదాది అవయవాలతో కూడినట్టి ఈదేహం, వృద్ధాప్యం మొదలైన కారణాలవల్ల కృశించిపోతుంది. అప్పుడు మామిడిపండులాగా, అత్తిపండులాగా, రావి పండులాగా, కొమ్మకుగల సంబంధాన్ని వదలించుకొని క్రిందపడ్డట్లుగా, ఈ శరీరావయవాలనుండి వదలించుకొని, తన కర్మననుసరించి, ఏ మార్గం నుండి వచ్చాడో ఆ మార్గానే మరొక యోనిలో (జన్మస్థానంలో) ప్రాణంతోకూడిన అవయవాలతో ప్రకటమవటం కోసం వెళ్ళిపోతాడు. (ప్రాణాది అవయవాలు ఉంటేనేగాని కర్మఫలాన్ని అనుభవించటానికి వీలులేదు కాబట్టి, ఆవిధమైన శరీరంకోసం వెతుక్కుంటూ పోతాడు).

"తద్యథా రాజానం...... ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవతి (బృ. ఉ. 4-3-38)

అట్లా రాజుగారికి ముందుగా నడుస్తూ వెళ్ళే ఉగ్రులు, సూతులు, ఇతర గ్రామాధికారుల్లాగా, ఊర్ధ్వశ్వాస తీసుకోవటం ప్రారంభించగానే, అంత్యకాలంలో సమస్త ప్రాణాలూ, చక్షురాదీంద్రియాలూ, అన్నీ జీవాత్మకు ముందుగా నడుస్తూ పోతాయి.

"స యత్రాయ మాత్మాబల్యం......పరాఙ్పర్యావర్తతే థా రూపజ్ఞో భవతి" (బృ.ఉ. 4.4.-1)

ఈ జీవాత్మ దుర్బలమైనట్లుగా అయి (ఆత్మ దుర్బలమవటం ఉండదు. ఇంద్రియాలు దుర్బలమైనందువల్ల ఆత్మ దుర్బలమైనట్లుగా అనిపిస్తుంది. అంతే) సమ్మూఢ స్థితిని చెంది (వివేకంపోయి, ఏమీతెలుసుకోలేని స్థితికి వచ్చినట్లుగా అయినప్పుడు, 'మనం అతనికి స్పృహలేదు. అని అంటాము. (ఆత్మకు విమూఢ స్థితి అంటూ ఉండదు. చూచేవానికి అట్లా అనిపిస్తుంది. అంతే!) వాక్కు మొదలైన ప్రాణాలు, ఆ ఆత్మఎదుట చేరతాయి- కండ్లు మొదలైన ఇంద్రియాలు తమలోని తేజస్సును, (రూపగ్రహణాది శక్తులన్నింటినీ) ఉపసంహరించుకొని, హృదయంలో అభివ్యక్తమయ్యే విజ్ఞానమయునిలో (ఆత్మలో) చేరిపోతాయి. అప్పుడే చాక్షుషపురుషుడు (కంటికి అధిదేవత అయిన సూర్యునియొక్క ఆదిత్యాంశ) అన్నివైపులనుండి అనుగ్రహించటం మానివేసి, తనదైన ఆదిత్య స్వరూపాన్నీ పొందుతాడని భావం. అంటే, ఆస్థితిలో మరణాసన్నుడైనవాడు రూపాలకు సంబంధించిన జ్ఞానాన్ని కోల్పోతాడు. అప్పుడే, మనం ఆమనిషికి కంటిచూపు పోయింది' అని అంటాము. అట్లాగే, ఇతర ఇంద్రియాల్లో ఉండే జ్యోతి (శక్తి) ఉపసంహరింపబడుతుంది. అప్పుడు మనం చూపుపోయిందనీ మాటపోయిందనీ, గుటకపడటంలేదనీ ఇట్లా అంటాం. అంటే ఇంద్రియాలన్నీ తమ పనిని మానివేశాయన్న మాట.

"ఏకీభవతి, న పశ్యతీత్యాహుః..............పూర్వప్రజ్ఞా చ (బృ. ఉ. 4-4-2)

నేత్రేంద్రియం, ఘ్రాణేంద్రియం, రసనేంద్రియం, వాగింద్రియం, శోత్రేంద్రియం, స్పర్శేంద్రియం ఇవన్నీ ఒక్క టొక్కటే లింగాత్మతో (కారణ శరీరంలో ఉండే ఆత్మతో) ఏకరూపం చెందగానే (లీనం అయిపోగానే) బంధువులంతా చూపుపోయిందనీ, వాసనచూచీ శక్తి పోయిందనీ, ఊపిరి ఆడటంలేదనీ, రుచి తెలియటంలేదనీ, గుటక పడటం లేదనీ, మాటపడి పోయిందనీ, వినికిడి పోయిందనీ, స్పర్శపోయిందనీ అంటూంటారు. అట్లాగే మనస్సు లింగాత్మతో కలసిపోగానే మననశక్తిపోయిందనీ, బుద్ధిసైతం లింగాత్మతో కలసిపోగా, ఏమీతెలియటం లేదని అంటాము. ఆస్థితిలో జీవాత్మ

హృదయం నుండి బయటకు పోవటానికి మార్గం చక్కగా, ప్రకాశవంతంగా ఉంటుంది. ఆ స్థితిలో ఈజీవాత్మ నేత్రం నుండి గాని, శిరస్సుగుండాగానీ, ఇతర ఇంద్రియాలగుండా గానీ బయటకు వచ్చేస్తుంది. ప్రాణం బయటకు రాగానే ఇంద్రియాలన్నీ బయటకు వచ్చేస్తాయి-అంటే, ఇంద్రియాలన్నీ శక్తివిహీనాలై పోతాయి. అందుకే అశరీరాన్ని 'కట్టె' అంటారు. ఆస్థితిలో జీవుడు మంచి విజ్ఞానవంతుడుగా ఉంటాడు. విజ్ఞానంతో కూడిన ప్రదేశానికే వెడతాడు. అతనితోపాటు జ్ఞానము. కర్మ, పూర్వజన్మలోని అనుభవాలవల్ల కలిగిన సంస్కారం, ఇవన్నీ అతని వెంట వెడతాయి.

ఇంద్రియాలలోని తేజోమాత్రలన్నింటినీ గ్రహించి ఉండటంవల్ల స్వయం ప్రకాశస్థితిలో ఉన్న, లింగశరీరాత్మ, హృదయచ్ఛిద్రం వద్ద ఉండే నాడీముఖం వద్ద (నిర్గమన ద్వారం వద్ద) భావి దేహ విషయకమైన జ్ఞానంతో కూడి ఉంటుంది. అయితే, లింగపురుషుడు స్వతంత్రుడుకాడు. (ఏవిధమైన వాసనలూ, సంస్కారాలూ లేకుండా, స్వతంత్రుడు విజ్ఞానవంతుడూ అయితే అతడు కృతకృత్యుడైనట్లే!) ఆలింగాత్మ వాసనలతో కూడి ఉండటంవల్లనే జనన మరణాలు, మొదలైన వికారాలు కలుగుతున్నాయి.

"తద్యథా తృణజలాయుకా.....ఆత్మానముపసంహరతి (బృ. ఉ.4-4-3)

జీవాత్మ ఈ జీర్ణశరీరాన్ని వదలి ఎట్లా వెడుతుంది? అనే ప్రశ్నకు దృష్టాంతంగా ఇట్లా చెప్పారు- జలగ లేదా గొంగళిపురుగు, ఒక గడ్డిపోచ చివరకుపోయి, మరియొక గడ్డిపోచను పట్టుకొని (క్రొత్త ఆధారాన్ని పొంది) శరీరాన్ని ముడుచుకుంటుంది. దానితో పాతగడ్డిపోచమీదనున్న పట్టు తప్పి పోతుంది. అట్లాగే జీవాత్మ లోగడ తానున్న శరీరాన్నుండి ఉపసంహరిచుకొని, క్రొత్తశరీరంలో ఆత్మభావాన్ని పొందుతుంది. ఇది సామాన్యంగా జీవుడు దేహాంతర ప్రాప్తిని పొందే పద్ధతి. పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు శరీరత్యాగం చేసి మరొక శరీరాన్ని పొందే విధం ఇది. దీనిని బట్టి మనం గ్రహించాల్సిన విషయం ఏమంటే, సామాన్య జీవులు ఆలస్యం లేకుండానే వేరొక యోనిని పొందుతారు; అని కొంతమంది, 12 రోజులు తరువాత అనీ,

మరికొంతముంది, ఏడాదితరువాత అనీ, ఇంకాకొంతమంది స్వర్గంలోను, నరకంలోను కర్మానుభవం అయినపిమ్మట మరొక జన్మపొందుతారనీ చెపుతారు. అందులో సత్యంలేదనీ, స్వర్గనరకాలు ప్రత్యేక లోకాలుగా లేవనీ దీనిని బట్టి తెలుస్తుంది. జీవునికి యిప్పుడు చెప్పిన గతి (మార్గం) ఒకటి ఇంకా రెండు రకాల గతులను ఉపనిషత్తులే చెప్పినాయి. వాటిని గూర్చి తరువాత తెలుసుకొందాం. ఈ సందర్భంలో ఉపనిషత్తులు చెప్పిన మూడురకాల శరీరాలు అయిదుకోశాలను గూర్చి తెలుసుకొందాం.

## 4. శరీర విభజనం

**మూడుశరీరాలు :**

ఈ సందర్భంలో మనకు కనిపించే స్థూలశరీరమే కాకుండా ఇంకా రెండు శరీరాలు ఉన్నాయని గ్రహించాలి. అంటే శరీరాలు మూడు అన్నమాట 1) స్థూలశరీరం 2) సూక్ష్మశరీరం 3) కారణశరీరం (లింగశరీరం) 1) స్థూలశరీరంలో మనకు పైకికనిపించే 10 ఇంద్రియాలూ, గుండె, ఊపిరితిత్తులు, ఎముకలు, రక్తం మొదలైనవన్నీ ఉన్నాయి. ఇది జాగ్రదవస్థలో–మనం మేలుకొని ఉన్నప్పుడు పనిచేస్తూ ఉంటుంది. ప్రాకృతిక నియమాల్ని అనుసరించి గుండె ఊపిరితిత్తులు స్వప్నంలోను, నిద్రలోనూ కూడా పనిచేస్తాయి. మనం సామాన్యంగా చెప్పుకొనే మరణం, ఈ స్థూల శరీరం పని చేయకుండా పోవటాన్ని గురించే! ఈ శరీరం స్థూల శరీరం పనిచేయకుండా పోవటాన్ని గురించే! ఈ శరీరం స్థూల భూతాలవల్ల ఏర్పడింది. (పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం) ఈ జాగ్రత్ అవస్థలో ఉండే పురుషుని వైశ్వానరుడు అంటారు.

**2. సూక్ష్మశరీరం :** బుద్ధి, అహంకారం, జ్ఞానేంద్రియ విషయాలు (శబ్ద, స్పర్శ రూపరసగంధాలు) పంచప్రాణాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, మొత్తం 18) సూక్ష్మశరీరాన్ని శక్తి సముదాయరూపంగా గ్రహించవచ్చు. దీని స్వరూపం మనకు స్వప్నంలో గోచరిస్తుంది. స్వప్నంలో పనిచేసేది ఈ

సూక్ష్మశరీరమే! ఈదశలో మనస్సు ప్రధానంగా పనిచేస్తుంది. ఈ స్వప్నావస్థలో ఉండే పురుషుని తైజసుడు అంటారు.

**3. కారణశరీరం (లింగశరీరం) :** నిద్రలో మూఢావస్థలో నున్న శరీరం– ఏమీతెలియని స్థితి. ఈ కారణశరీరంతో నిద్రలో ఉండే పురుషుణ్ణి ప్రాజ్ఞుడు అంటాడు. ఇతడు మళ్ళీ నిద్రనుండి మేల్కాంచినట్లే మళ్ళీ జన్మకు కారణమౌతున్నాడు. అట్లా అయ్యేందుకు తగిన కారణాలు కలిగిన శరీరం ఇది! అందుకే కారణశరీరం అన్నారు. అకారణాలు కర్మ, అనుస్మృతి, శబ్దము, విధి అనేవి, కర్మ : నిన్న కొంతవరకు చేసి అపివేసినపనిని, మరునాడు మేల్కొని అపినచోటునుండి ప్రారంభించి పూర్తిచేస్తున్నాం. కాబట్టి నిన్నటి జీవుడే ఈనాడూ ఉన్నాడనీ. అట్లాగే నిద్రకు పూర్వం ఉన్నవాడే మేల్కొన్న తరువాత కూడ ఉన్నట్లు జ్ఞానం కలుగుతోంది.

**అనుస్మృతి:** పూర్వానుభూతమైనది స్మరణకురావటం. నిన్న ఫలానా పనిచేసింది నేనే అనే, సుషుప్తికి పూర్వం ఉన్నది నేనే అనే జ్ఞానం కలగటం (ప్రత్యభిజ్ఞ)

**శబ్దవిధులు:** శ్రుతులలో చెప్పబడిన యజ్ఞయాగాది విధులు, జ్ఞానము, విద్య విధించేవిధులు. ఎప్పుడో ఫలాన్ని యిచ్చే పనులను చేస్తున్నామంటే ఈనాడు నిద్రించినవాడూ, రేపు నిద్రించేవాడూ ఒకడేకావాలిగదా! అట్లా కాకపోతే శ్రుతివాక్యాలూ, అవి విధించే కర్మలూ అన్నీ వ్యర్థమే అవుతాయి.

ఇట్లా శరీరాన్ని మూడు విభాగాలుగా విభజించినట్లే, ఉపనిషత్తులు శరీరాన్ని అయిదు కోశాలుగా కూడా విభజించాయి. ఈ మూడు శరీరాలు, ఆ అయిదు కోశాల్లోనూ (అరలలోను) అంతర్భాగం చెందుతాయి.

స్థూలశరీరం = అన్నమయకోశం
సూక్ష్మ శరీరం = ప్రాణమయకోశం
మనోమయకోశం

విజ్ఞానమయకోశం

కారణం శరీరం= ఆనందమయకోశం

సూక్ష్మశరీరానికి అవయవాలు, ఇంద్రియ గోలకాలు ఉండవు. కాబట్టి స్థూల శరీరావయవాల్లాగా పనిచేయలేవు. కాబట్టి వాటికొకలోకం (మరణం పిమ్మట) ఉన్నదనటం కుదరదు. చనిపోయిన వ్యక్తికి 'ప్రేత' అని సంకల్పంలో చెప్పి ప్రేతతృప్తికోసం, ప్రేత అనుభవంకోసం రకరకాల కర్మలు చేస్తున్నారు. జీవుడు శరీరాన్ని వదలినప్పటినుండి భస్మమైపోయేదాకా ఆ శవాన్ని 'ప్రేత' శబ్దంతో పిలుస్తారు. భస్మమైపోతే 'భూతం' అవుతుంది. అంటే జరిగిపోయినది. లేదా, పాంచభౌతిక శరీరం, స్థూలభూతాల్లో చేరిపోయింది అనిభావం. అంతే తప్ప 'ప్రేతయోని' ఒకటి ఉన్నదనుకోవటం భ్రమ. ప్రేతకొక లోకమూ లేదు. ఈభూత ప్రేతాలతో బ్రతికేవాళ్ళున్నారు. ప్రేతాలతో, భూతాలతో మాట్లాడిస్తామనీ, వారిని అవాహన చేస్తామనీ, వాటిద్వారా అసంభవమైన పనులను చేయిస్తామనీ అజ్ఞానులను నమ్మించి, మోసగించి పొట్టపోసుకొనే వారు కొందరున్నారు.

## 5. పునర్జన్మ

### వేదాల్లో మృతునికి చెప్పబడిన ఎనిమిది దశలు:

జీవాత్మకు మరణం పిమ్మట ముఖ్యంగా 'గతి' 'అగతి' అని రెండు ప్రధాన దశలు చెప్పబడ్డాయి. 'గతి' అంటే లోకాంతరాలకు పోవటం ఉన్నది అని అర్థం. 'అగతి' అంటే లోకాంతరగమనం లేకపోవటం అని భావం. 'అగతి' అంటే ముక్తి అనేభావం కూడా ఉంది. తత్త్వదర్శియైన వానికుండే 'అగతి' సర్వోత్తమమైన దన్నమాట. దీనినే స్వరూపావస్థితి అంటారు. వేదాంతం అంతటా ఈ స్థితిని వర్ణించారు. ఈ అగతి (ముక్తి) రెండు రకాలుగా విభజింప బడ్డది. 'క్షీణోదర్కము' 'భూమోదర్కము' అని.

'క్షీణోదర్కముక్తి' అంటే– ఈ శరీరం, ఇంద్రియాలు, ప్రాణాలు మొదలైనవన్నీ అనాత్మ పదార్థాలనే విషయాన్ని 'నేతి "నేతి' (ఇది ఆత్మకాదు,

ఇది ఆత్మకాదు) అంటూ నిషేధించుకొంటూ పోగా, నిరాకారము, నిర్విశేషము అయిన విశుద్ధాత్మ దర్శనం కలుగుతుంది. అట్టి విశుద్దాత్మ దర్శనం ద్వారా కలిగే ముక్తిని క్షీణోదర్కముక్తి అంటారు.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ఈ జగత్తంతా బ్రహ్మమే) ఇదం సర్వం యదయమాత్మా" (ఈ సమస్తమూ ఆత్మే) "సర్వం వాసుదేవః" (సమస్తమూ వాసుదేవస్వరూపమే!) అనే పద్ధతిలో ఆత్మవ్యాప్తి విస్తారం జరిగిన మీదట విశ్వాత్మ దర్శనం లభిస్తుంది. తద్వారా లభించేముక్తి "భూమోదర్కముక్తి". ఈరెంటిలోను పరలోకగమనంగానీ, పునర్జన్మగానీ ఉండదు.

మరణానంతరం ఈభూమి మీదనే, ఈగలు, దోనులు, ఇతరమైన ఎముకలు లేని స్వేదజ ఉద్భిజాదులుగా జన్మించటం మూడవ అగతి.

అట్లాగే మరణానంతరం ఎముకలున్న పశుపక్ష్యాదులుగా జన్మించటం నాల్గవ అగతి- మరొకలోకానికి పోవటం ఉండదుకాబట్టి ! సర్వశ్రేష్ఠమైన మొదటి రెండు అగతులలాగానే వీటిని కూడా అగతిగా (పరలోకప్రాప్తి లేకపోవటంగా చెప్పారు.).

మొదటి రెండు అగతులలో తత్వదర్శియైన వారికి (క్షీణోదర్కులు) విశ్వాత్మదర్శనంచేసిన (భూమోదర్కులు) వారికి చెప్పిన అగతులలో ఉత్క్రాంతి ఉండదు. ఉత్క్రాంతిని గురించి శ్రుతులు ఇట్లా చెపుతున్నాయి- "న తస్య ప్రాణా ఉత్కామన్తే అత్రైవ సమవలీయన్తే" (బృ. ఉ. 4-4-6) అట్టివారి ప్రాణాలు ఉత్క్రాంతిని చెందవు. ఇక్కడే అధిష్ఠానంలో విలీనమై పోతాయి. "స యదాఽస్మాచ్ఛరీరాదుత్క్రామతి సహైవైతైః సర్వైరుత్క్రామన్తి" (కౌషీ ఉ.3-4) జీవుడు ఈ లోకాన్నుండి వెళ్ళేటప్పుడు వాగాదీంద్రియాలన్నింటితోనూ వెడతాడు. అనీ, "యేవైకే చా స్మాల్లోకాత్ప్రయన్తి చంద్రమసమేవతే సర్వే గచ్ఛన్తి" (కౌషీ ఉ.1-2) ఈలోకాన్నుండి ప్రయాణమైపోయిన జీవులు చంద్ర లోకానికే పోతున్నాయి, అని జీవునికి పరలోక గమనాన్ని చెపుతన్నాయి. అట్లాగే "తస్మాల్లోకాత్పునరేత్యస్మైలోకాయ కర్మణే" (బృ. 4-4-6) ఆలోకం

నుండి ఈలోకానికి జీవులు కర్మచేయటానికే వస్తున్నాయి, అని గతిని ఆగమనాన్నీ శ్రుతులు చెపుతున్నాయి. అయితే, జనన మరణాలకు (గమనాగమనాలకు) కర్మకారణంగా తెలుస్తోంది, ఇట్టి ఉత్క్రాంతి, గతి, ఆగమనం ఉన్న జీవుడు అణుపరిమాణుడై ఉంటాడని వేదాంత దర్శనం చెపుతోంది. 1) బ్రహ్మలోకగతి 2) దేవలోకగతి 3) పితృలోకగతి 4) నరకగతి అని గతులు నాలుగురకాలు.

గతి (గమనం) ఉన్నప్పుడు మార్గమనేది తప్పకుండా ఉండితీరాలి. అందుకే వేదాల్లో మార్గాన్ని వర్ణించారు.

"ద్వే సృతీ అస్రుణ్వం పితృణామహందేవానాముత మర్త్యానామ్

తాభ్యామిదం విశ్వమేజత్ సమేతి యదన్తరా పితరం మాతరం చ (ఋ. వే. 10.88-15)

"మనుష్యులకున్న రెండు మార్గాలను గురించి విన్నాను- దేవమార్గము, పితృమార్గము (దేవయానము, పితృయానము) ఈలోకంలోని ప్రాణులన్నీ మరొకలోకానికి వెళ్ళేటప్పుడు పృథివికి, స్వర్గానికీ మధ్య నున్న (మాతరం పితరం అంతరా) అంతరిక్షలోకం గుండా చక్కగా వెడతాయి" అని మూడు లోకాలను రెండు మార్గాలనూ వేదాల్లో చాలాచోట్ల విశదంగా వర్ణించారు. వాటిని గురించి తరువాతి పేజీల్లో వివరింపబడుతుంది.

పృథివి, అంతరిక్షం, ద్యులోకం ఈమూడులోకాలకు ముఖ్యదేవతలను, పదేసి సహాయకులను చెప్పారు (ఋ.వే.1-139-11) పృథివీలోకం. ముఖ్య దేవత 1. అగ్ని. 2. జాతవేద 3. వైశ్వానరుడు. 4. ద్రవిణోదా 5. తనూనపాత్ 6. నారాశస్ 7. త్వష్టా 8. వనస్పతి 9. గ్రావాణ 10. రథ 11. ఆపః

**అంతరిక్షలోకం:** ముఖ్యదేవత 1. వాయువు 2. వరుణ 3. రుద్ర 4. ఇంద్ర 5. పర్జన్య 6.బృహస్పతి 7. యమ 8.మిత్ర 9. కః 10. విశ్వకర్మ 11. సవిత

ద్యులోకం- ముఖ్యదేవత 1. అదిత్యుడు 2. అశ్వనీదేవతలు 3. ఉష 4. సూర్యా 5. త్వష్ట 6. సవిత 7. భగ 8. పుషా 9. విష్ణు 10. యమ 11. ఏకపాత్ మొత్తం 3 × 11 = 33 దేవతలు.

జీవాత్మ ఈ పృథివినుండి మరియొకలోకానికి వెళ్ళేటప్పుడు అగ్ని తన పదిమంది సహాయకులైన దేవతలతో అతనికి సహాయం చేస్తాడు. అట్లాగే. వాయువు అంతరిక్షంలోను, ఆదిత్యుడు ద్యులోకంలోను, జీవాత్మకు సహాయం చేస్తారు. ఈ విషయం మనశ్రుతుల్లో అత్యంతరమణీయంగా, విపులంగా చెప్పబడ్డది.

**పురాణాల్లో పరలోకం పునర్జన్మలను గూర్చి:**

హిందూమతానికి పురాణాలు మూలస్తంభాలు. వాటిమీదనే వేదమత మహాసౌధమంతా నిలిచిఉంది. వేదాలు ఆస్తంభాలకు ఆధారపీఠం. సృష్టి స్థితిలయాకారకులైన బ్రహ్మ విష్ణుమహేశ్వరులకు, అవతార పురుషులైన రామకృష్ణ బుద్ధ నారసింహాదులకు, మహాపతివ్రతలైన సావిత్రి అనసూయ సీత అహల్యాదులకు,నారద మాండవ్యాది మహర్షులకు పూర్వజన్మ. ఉత్తరజన్మ లున్నట్లుగా మనపురాణాలు చెపుతున్నాయి. వారు చేసిన కర్మల ఫలాన్ని అనుభవించటానికై ఉత్తరజన్మలు పొందినట్లు చెవుతున్నాయి. కాబట్టి, అజ్ఞానం కారణంగా శరీరాన్ని పొందినజీవాత్మ కర్మచేయకతప్పదు. ఆ కర్మకు ఫలంతప్పదు. ఆ కర్మఫలభోగానికై మళ్ళీ వేరొకజన్మ తప్పదు. ఈ కర్మ జన్మల చక్రంలో తిరగటం అనేది అజ్ఞానావరణం తొలగేదాకా జీవాత్మకు తప్పదు అనే విషయం తెలుస్తోంది.

**పునర్జన్మ :** ఇట్లా ఆత్మ ఒక శరీరాన్ని వదలి వేరొక శరీరాన్ని ధరించటాన్నే పునర్జన్మ అంటున్నారు. జీర్ణవస్త్రాన్ని వదలి మనం క్రొత్త వస్త్రాన్ని ధరించినట్లుగా జీవాత్మ జీర్ణశరీరాన్ని వదలి క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది అని భగవద్గీతలో చెప్పారు- "జీర్ణాని వస్త్రాణి యథావిహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ (భ.గీ. 2-20) ఈ విషయాన్నే శ్రుతులూ చెప్పినాయి.

మరణంతో శరీరం నష్టమైపోతోంది. ఆత్మకు మాత్రం చావులేదు. "వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరం" (యజు-అ.4) ఆత్మ ఎల్లప్పుడూ ఉంటుందనీ, ఒకటిగానే ఉంటుందనీ, శరీరం మాత్రమే భస్మం అయ్యేటంతవరకూ ఉంటుందనీ చెప్పారు. ఆత్మకు చావుపుట్టుకలు లేవు. నాశనం లేదు. అది సనాతనం అని శ్రుతి చెపుతోంది.

"న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ఆజోనిత్యః శాశ్వతోయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే । (కఠ 2-18)

చనిపోయిన వాని గతి ఏమిటి? అని నచికేతుడు యముని అడిగాడు. యముడు ఇట్లా చెప్పాడు- "యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః స్థాణుమన్యేను సంయన్తి యథా కర్మ యథా శ్రుతమ్" (కఠ 5-7)

శరీరపాతం అయిన తరువాత అజ్ఞానులైనవారు, (దేహమందు అభిమానం కలవారు) తాముచేసిన కర్మలవల్లను, తాము సంపాదించిన విజ్ఞానాన్ని బట్టీ వారు తగిన యోనుల్లో (జన్మస్థానాల్లో) పడి, మళ్ళీ పుడుతూ ఉంటారు. చస్తూ ఉంటారు. కొంతమంది తమ కర్మలనుబట్టి స్థాణువులౌతారు- చెట్లు చేమలుగా పుడతారు. తమ కర్మ ఫలాన్ని అనుభవించటానికి తగిన జన్మను అటువంటి శరీరాన్నీ పొందుతారని భావం. కాబట్టి, కర్మఫలానుభవం కోసం స్వర్గనరకాది లోకాల కల్పనం మనశ్రుతులు చెప్పలేదు. మంచికర్మలు చేసినవాడు మంచియోనుల్లోను, చెడ్డకర్మల్ని చేసినవాడు చెడుయోనుల్లోను పుట్టి, ఆయాఫలాలు అనుభవిస్తాడు. వారివారిజ్ఞాన కర్మల్నిబట్టి తరువాత జన్మ ఉంటుందని స్పష్టమౌతోంది. అనేక కోట్ల జీవరాసులు అనుక్షణం పుడుతూ కర్మఫలాన్ని అనుభవించి చస్తూ మళ్ళీ పుట్టటం చూస్తున్నాం. గర్భనరకాదులైన అనేక కష్టాలు, సుఖాలు అనుభవించటం చూస్తున్నాం. మనకర్మలే మన పునర్జన్మకు కారణం అని గ్రహించాలి.

పశుపక్ష్యాదుల జన్మలకంటె, స్థావరాదులకంటె మానవ జన్మ ఉత్కృష్టమైనదని మనకు తెలుస్తోంది. మంచిగుణాలతో మంచికర్మలు చేసి,

మంచిఫలితాలను పొందటానికి అవసరమైన జ్ఞానశక్తి, క్రియాశక్తి, మానవునిలో వికాసం చెందింది. కాబట్టి తన భావిజన్మను తాను నిర్ణయించుకోవచ్చు. మిగతా జీవుల్లో ఈ అభివృద్ధి కనిపించదు. అందుకే మానవుల్లో మనకు మూడు రకాల వారు కనిపిస్తారు.

1. తమోగుణ ప్రధానులై కేవలం లౌకిక జీవనంలో పశుప్రాయులుగా జ్ఞానవిహీనులై ఉండేవారు. వీరి మరణానంతరస్థితిని పునర్జన్మను గూర్చే పైన చెప్పబడ్డది. ప్రోరబద్ధకర్మ ఫలాన్ని అనుభవించి, మళ్ళీ వెంటనే మరియొక యోనిని పొందుతారని!

2. కొందరు రజోగుణాధిక్యతను పొంది యజ్ఞయగాది కర్మకాండలుచేస్తూ ప్రవృత్తి మార్గంలో ఫలాన్ని ఆశిస్తూ సత్కర్మలు చేస్తూ ఉంటారు. స్వర్గాన్ని-పరలోకసుఖాన్నీ, ఇహలోకభోగాల్నీ ఆశిస్తూ ఉంటారు. మరణానంతరం, ఇట్టివారికి ధూమాదిమార్గం చెప్పారు. దీనినే పితృయానం అనీ, దక్షిణాయనమార్గమనీ, చాంద్రమసీ దశఅనీ, స్వర్గయానమనీ అనేకపేర్లతో చెపుతారు.

3. మరికొంతమంది సత్త్వగుణాధిక్యం కలవారై ఈలోకాన్ని ఈ జీవనాన్ని అసత్యంగా, భ్రమగా యెంచి, జ్ఞానవంతులై, ఐహిక విముఖులై, మోక్షకాములై శరీరత్యాగం చేస్తారు. అట్టివారు పోయేమార్గాన్ని అర్చిరాదిమార్గం, ఉత్తరాయణ మార్గం, దేవయానం, సూర్యమార్గం, బ్రహ్మలోకమార్గమనీ అంటారు.

## 6. జీవుని గతులు- పరలోక మార్గాలు

### జీవునికి చెప్పబడిన రెండవ మార్గం- ధూమాది మార్గం:

దీనినే స్వర్గమార్గం అంటారు. దీనిగురించి ఛాందోగ్యోపనిషత్తు 5వ అధ్యాయం 10వ ఖండంలో విపులంగా వర్ణించారు. ధూమ్రదశ- రాత్రిదశ- కృష్ణపక్షీయదశ- షాణ్మాసిక దక్షిణాయనదశ- పైతృకదశ- చాంద్రమసీ దశ. ఇట్లా క్రమంగా చాంద్రమసీ దశను పొంది, తానుచేసిన యజ్ఞయాగ

దానధర్మాది సత్కర్మలఫలాన్ని అనుభవించి, మళ్ళీ ఈ దిగువ అవరోహణ క్రమంలో మనుష్య యోనిని పొందుతారు. దీనిని పితృయానమనీ అంటారు.

అంటే, చాంద్రమసీదశ (స్వర్గం)–పైతృకదశ– షాణ్మాసిక దక్షిణాయన దశ – కృష్ణపక్షీయదశ– రాత్రిదశ– ధూమ్రదశ– ఆకాశం– వాయువు– అభ్రం (తెల్లనిమేఘం) – మేఘం– వర్షం– అన్నం ( ధాన్యాదులు) వీర్యం– మనుష్య జీవి.

శతపథ బ్రాహ్మణం 4–6–1–1–లో "సహసర్వం తనురేవ యజమానో ముష్మిం– లోకే సంభవతి" స్వర్గలోకంలో జీవులు శరీరంతో పుడతారు." అని ఇట్టివారికి (చాంద్రమసీ

దశను పొందినవారికి) లింగశరీరం ఉంటుందనీ చెప్పబడ్డది. అందుకేవీరికి పుసర్జన్మను చెప్పారు. కర్మకాండలవల్ల మోక్షం– జన్మరాహిత్యం– లభించదు అనటంలో ఉద్దేశ్యం అదే!

**మూడవ మార్గం :**

నిష్కామకర్మచేస్తూ, కర్మక్షయం అయినందున జీవన్ముక్తులైన వారి మార్గంగా చెప్పబడ్డది. జన్మమరణాలు లేనట్టి వీరు పొందేగతిని ఈ క్రమంలో చెప్పారు– దీనిని దేవయానం అంటారు.

అర్చిషీదశ (అగ్నిజ్వాల)– ఆహ్నికీదశ (పగటిదశ)– శుక్లపక్షదశ– ఉత్తరాయణదశ –సాంవత్సరదశ– సూర్యదశ– చంద్రమసీదశ– విద్యుద్ధశ– బ్రహ్మలోకప్రాప్తి.

ఈ మార్గాన్ని పొందే వానిని గూర్చి కఠోపనిషత్తు 4–13లో "అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః ఈశానో భూతభవస్య స ఏవాద్య స ఉశ్వః" అంగుష్ఠ మాత్రుడైన ఈ పురుషుడు పొగలేని జ్యోతిలాంటివాడు. అతడు నేడు ఉన్నాడు రేపు ఉంటాడు. అతడే నిజానికి బ్రహ్మతత్త్వం. అన్ని ప్రాణుల్లో నేడున్నాడు. రేపు ఉంటాడు. అతడు రేపు శాశ్వతుడు. కాబట్టి పునర్జన్మ ప్రసక్తిలేదు.

ముండకోపనిషత్తు 2-2-10లో కూడా ఈజ్యోతిస్వరూపుని వర్ణించారు. ఇట్టి బ్రహ్మజ్ఞానులకు, జీవన్ముక్తులకు పునరాగమనం లేదు.

బ్రహ్మలోకమనేది ఒక ప్రత్యేకలోకంగా ఎక్కడాలేదు. అది ఒక ప్రదేశంకాదు. బ్రహ్మత్వాన్ని, లేదా బ్రహ్మభావాన్ని పొందటాన్ని సూచించే పదం. ప్రకృతి నుండి పూర్తిగా విముక్తి పొందిన స్థితి. ముండకోపనిషత్తు 3-1-7లో ఇట్టివానిస్థితిని ఇట్లా వర్ణించారు- "గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు కర్మాణి విజ్ఞాన మయశ్చ ఆత్మా పరేవ్యయే సర్వ ఏకీభవన్తి-

**విదేహముక్తుని స్థితి:**

ఈ దేహానికి ఆరంభంలో ఉండిన ప్రాణం మొదలైన కళలు (ప్రాణం, శ్రద్ధ, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి, ఇంద్రియాలు, మనస్సు, అన్నం, బలం, తపస్సు, వేదమంత్రాలు, కర్మలు, లోకాలు, పేర్లు) తమకు కారణమైన వాటిలో కలసిపోతాయి. చక్షురాదీంద్రియాలు వాటికి అధిష్ఠాన దేవతలైన సూర్యుడు మొదలైన వాటిలో కలసిపోతాయి. అట్లాగే ఆరబ్ధ, అనారబ్ధ, సంచిత కర్మలు, విజ్ఞాన మయాత్మ(జీవుడు) ఇవన్నీ నాశరహితమైన శాశ్వతుడైన పరమాత్మలో (కుండలోని నీటిలో ప్రతిబింబరూపంలో ఉన్న సూర్యుడు ఆకాశంలోని సూర్యునిలో కలసిపోయినట్లు) కలసిపోతాయి.

## 7. కర్మలు- భేదాలు :

కర్మల్లో మూడు భేదాలు ఉన్నాయి. 1. క్రియమాణ కర్మ. ఇది కర్మకు మొదటి స్థితి. అంటే, కర్మ జరుగుతున్నప్పుడు దానిని క్రియమాణకర్మ అంటారు. 2. క్రియమాణ స్థితి సమాప్తమైపోతే అట్టికర్మను సంచితకర్మ అంటారు. 3. ఈ సంచిత కర్మకు లభించవలసిన ఫలం ఆరంభమైనప్పుడు దానిని ప్రారబ్ధకర్మ అంటారు. ప్రారబ్ధమనేది స్వతంత్ర కర్మకాదు. కర్మఫలానుభవస్థితి అన్నమాట. ఇది ఎక్కు పెట్టబడి వదలిన బాణంలాంటిది. దీనిని ఎవరూ ఆపలేరు. సంచితకర్మ ఫలాన్ని అనుభవించకుండా

తప్పించుకోలేక పోయినా సత్కర్మాచంరణం ద్వారా భగవద్భక్తిద్వారా జ్ఞానంద్వారా దాని దుష్ట ప్రభావాన్ని కొంత వరకు తగ్గించుకోవచ్చు. క్రియమాణకర్మ అనేది మిగతా రెంటికీమూలం. కాబట్టి జీవితంలో మనం చేసేపనులు నిష్కామబుద్ధితో చేస్తే అట్టి నిష్కాను కర్మకు మిగతా రెండు అవస్థలూ ఉండవు.

## గుణకర్మలను బట్టి జన్మ:

పుట్టుక అనేది నాలుగురకాలుగా మనకు కనిపిసోత్తంది. 1. ఉద్భిజ 2. స్వేదజ. 3. అండజ 4. జరాయుజములు. భూమిని బ్రద్దలు చేసి పైకివచ్చే చెట్లు చేమలు ఉద్భిజాలు. చెమటనుండి, నీటినుండి, గాలినుండి రజోవీర్యాల అవసరం లేకుండానే కొన్నిరకాల క్రుమికీటకాదుల ఉత్పత్తి జరుగుతోంది. దీనిని అమైధున సృష్టి అని కొందరంటారు. అంటే తల్లి గర్భంలో వీర్య స్థాపనం లేకుండానే పుడుతున్నాయి. కొన్ని రకాల చేపల్లో, ఈగల్లో కొన్నిరకాల చీమల్లో, మన ప్రేగుల్లో పుడుతూ ఉండే నులిపురుగుల్లాంటి వన్నీ యిట్లా పుడుతున్నట్లు శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. ఉద్భిజ స్వేదజాలనే రెండురకాల ఉత్పత్తీ అమైధునీ సృష్టి క్రిందకు వస్తాయి. అండజములు ముందు గ్రుడ్డుగా పుట్టి పిమ్మట పక్షిలాగా మారుతోంది. జరాయుజములన్నీ తల్లి గర్భంలోనే పెరిగి అవయావదులు ఏర్పడి జన్మిస్తున్నాయి. పశువులు, మానవులు మొదలైనవన్నీ జరాయుజములు. అండజ జరాయుజములు మైధునీ సృష్టికి సంబంధించినవి.

సృష్ట్యారంభం, అమైధునీ ప్రక్రియ ద్వారా జరిగినట్లు మనకు తెలుస్తుంది. స్థూల జగదుత్పత్తి క్రమం, తైత్తిరీయోపనిషత్తులో ఇట్లా చెప్పారు– పరమాత్మ నుండి → ఆకాశం(Either) → వాయువు → అగ్ని → నీరు→ పృథివి → గడ్డి వగైరా ఓషధులు→అన్నం (ధాన్యం) రేతస్సు వీర్యం → జీవుడు (తై. ఉ. అ. పల్లీ–1)

దీనిని బట్టి జన్మ మరణం, పరలోకం, పునర్జన్మ అనే ఈ సంసార చక్రానికి కర్మ అనేది ప్రధానకారణంగా మనకు తెలుస్తోంది. కర్మనుబట్టి జనన మరణాదులు, ఆ కర్మ ఫలానుభవంకోసం పరలోక పునర్జన్మాదులు లభిస్తున్నాయని స్పష్టమౌతోంది.

## 8. సారాంశం

ఇంతవరకు చెప్పిన దానినిబట్టి గ్రహించవలసిన ముఖ్యాంశాలు:

1. పుట్టుకలాగానే చావు అనేది అనివార్యము. ప్రకృతి నియమం. మరణంకోసం దుఃఖించటం అనవసరం.
2. మమకారము, స్వార్థము అనేవి అజ్ఞానం వల్ల జనించేవి. వాటివల్లనే మృత్యుభయం, దుఃఖం కలుగుతున్నాయి.
3. శరీరాన్ని వదలిపోయే జీవాత్మతోపాటు ధర్మాధర్మాలు, పుణ్యపాపకర్మలు మాత్రమే వెడతాయి. అంటే, జీవుడు తానుచేసిన కర్మఫలాలను అనుభవించి తీరాలి. పూర్వ కర్మ జన్మవాసనలు, సంస్కారాలు లింగ శరీరంతోపాటు ఉంటాయి.
4. జీవుడు తానుచేసిన కర్మఫలాలను అనుభవించటం కోసం, తగిన శరీరాన్ని – (యోనిని– పొంది) మళ్ళీ జన్మిస్తాడు. పునర్జన్మ అనేది సంచిత కర్మ ఫలాన్ని బట్టి ఉంటుంది. ఇతరులు చేసే కర్మల్నిబట్టి క్రొత్త శరీరం రాదు. ఎవరికర్మ ఫలాన్ని వారు అనుభవించాల్సిందే!
5. సామాన్య జీవజంతువులు, పునర్జన్మను వెంటనే పొందుతాయి. కర్మిష్ఠులు, శుభాశుభ మిశ్రితకర్మలు చేసినవారు, పితృయానమార్గాన మళ్ళీ మనుష్య యోనిలో (కర్మపలానుభవం కోసం) త్వరలోనే పుడతాడు. జ్ఞానులైనవారికి సంచిత ప్రారబ్ధకర్మానుభవంలేనందున, దేవయాన మార్గంలో బ్రహ్మలోకాన్ని చేరతారు. వీరు ముక్తులు. పరమాత్మ స్వరూపులైపోతారు. పునర్జన్మ ఉండదు.
6. ఆత్మకు చావులేదు. శరీరం పని భస్మమైపోవటంతో సరి. మట్టిలో కలసిపోవటం అన్నా ఒకటే ! మనం మృతునికి చేసే కర్మలవల్ల ఇక అతనికి పునర్జన్మ

ఉండదనుకోవటం భ్రమ. అందువల్ల అతనికి కర్మనివృత్తికాదు. అతని పునర్జన్మను అతని సంచితకర్మలు, అతని జ్ఞానం మాత్రమే నిర్ణయిస్తాయి. భస్మమైపోవటంతోనే ప్రేత అనే పేరు పోతుంది. భూతసంజ్ఞ వస్తుంది.

7. స్వర్గం, నరకం, అనే ప్రత్యేకలోకాలు ఉన్నట్లు ప్రమాణాలు లేవు. ఆయా కష్టసుఖాలను అనుభవించటానికి తగిన శరీరాలకోసం, అందుకు తగినట్టి యోనుల్లో జన్మించటమే తప్ప గత్యంతరంలేదు. స్వర్గ నరకాదులు కల్పనలు, ఇట్లాగే, వారి వారి మత విశ్వాసాలనుబట్టి, యముడు, చిత్రగుప్తుడు, న్యాయ నిర్ణయదినం ఆత్మలన్నీ పునరుత్థానం చెందటం, ఇవన్నీ కథలుగా, పురాణాలుగా, వ్యాప్తిలోకివచ్చి అజ్ఞానుల మనస్సుల్లో బాగా తిష్ఠవేసినాయి.

8. మనకు వెనుక జన్మలనేకం గడచినాయి. ఇప్పుడీ జన్మననుభవిస్తున్నాం. సంచిత కర్మశేషంవల్ల తరువాత పునర్జన్మలుతప్పవు. పూర్తిగా కర్మక్షయం అయితేనే తప్ప జన్మరాహిత్యం– మోక్షం సిద్ధించదు.

9. మనంచేసే అపరకర్మలన్నీ (మృతునికిచేసే కర్మలన్నీ) మన నమ్మకాన్ని బట్టి చేసేవే! ఎవరి విశ్వాసాలను బట్టి వారు చేస్తున్నారు. అయితే, మనంచేసే ఏ పని అయినా, ఆ పనిని గురించిన పూర్తి జ్ఞానంతో చేస్తే మంచి ఫలితం (మనం ఆశించిన ఫలితం (మనం ఆశించిన ఫలితం) ఉంటుంది. ఏమీ తెలియకుండా, ఎవరో, ఏదో, చెప్పినట్లు చేసినందువల్ల ఎక్కువ ప్రయోజనం ఉండదు. అందుకే "ఈ పుస్తకం' ఉత్తరార్థంలో అయాకర్మలను గూర్చిన విశేషాలను తెలియజేయటం జరిగింది.

10. దయ్యాలు, భూతాలు, ప్రేతలు అవహించటం, ఆత్మలు మాట్లాడటం, ఇవన్నీ మానసిక విభ్రమాలు. ఒకటి మరొకటిగా కనపడటం, ఒక శబ్దం మరొక శబ్దంగా వినపడటం ఇవన్నీ ఇంద్రియ విభ్రమాలు. విశ్వాసం బాగా పాతుకుపోయి, ఆ విభ్రమానికి అలవాటు పడిపోయిన వారిలో ఈ లక్షణాలు అధికంగా కనిపిస్తాయి.

11. శవాన్ని అగ్నితో భస్మంచేసినా, భూమిలో పాతిపెట్టినా, జరిగే పని దేహం మట్టిలో కలసిపోవటమే ! వారివారి విశ్వాసాలనుబట్టి ఆచారాలను బట్టి చేస్తారు అంతే!

12. కొంతమంది దీర్ఘరోగాలతో చాలాకాలం మంచానపడి మరణిస్తారు. కొందరు స్వల్ప అనారోగ్యంతోనూ, కొందరు ఏరోగమూ లేకుండానూ, కొందరు ప్రమాదాల్లో, ప్రకృతివైపరీత్యాల్లో- భూకంపాల్లో, కొందరు ఆత్మహత్యల్లో, హత్యల్లో మరణిస్తారు. ఎవరెట్లా మరణించినా, జీవుడు శరీరాన్ని వదలేపద్ధతి అందుకు పట్టే కాలం ఒకటిగానే ఉంటాయి. వారివారి గతులూ పైన చెప్పిన విధంగానే ఉంటాయి. ఇది గమనించాల్సిన విషయం.

13. స్వర్గనరకాలనేవి ప్రత్యేకలోకాలుగా ఉండి, పాపపుణ్య ఫలాలు అక్కడే అనుభవించి మళ్ళీ జీవుడు జన్మను పొందుతాడనటంలో సత్యమూలేదు. ఔచిత్యమూలేదు. ఎందుచేతనంటే, వారికర్మఫలభోగం అయిపోయినందున పుట్టే జీవులంతా, మళ్ళీ ఒకేవిధంగా ఏవిధమైన భేదమూలేకుండా పుట్టటంలేదు. కొందరు, ధనికులుగా, కొందరు బీదవారుగా, కొందరు జ్ఞానులుగా కొందరు మూఢులుగా, జన్మిస్తున్నారు. వీరంతా స్వర్గనరకాలకు ఒకేసారి పోవటం లేదు. న్యాయనిర్ణయ దినం, లేదా ఖయామత్ కా దిన్ అనేది ఒకసారే కల్పాంతంలో ఉంటుందా? లేక ప్రతిరోజూ మరణిస్తూ వచ్చే వారి కోసం రోజూ ఉంటుందా? ఏవిధంగా అయినా అందులో సత్యంగానీ, ఔచిత్యంగానీ, కనిపించదు. స్వర్గనరకాలు భిన్నలోకాలు కావు.

14. ప్రపంచంలో ఒక్క వేదమతానుయాయులేకాకుండా, అనేక మతాలవారున్నారు. మన చుట్టూ, ఇరుగుపొరుగున భిన్నమతాలవారు ఉంటున్నారు. వారి విశ్వాసాలు, వారి కర్మలు భిన్నంగా ఉంటున్నాయి. ఒకరి విశ్వాసాలను మరియొకరు విశ్వసించరు. హేళన చేస్తారు. ఒకరి ఆచార వ్యవహారాలు మరియొకరికి గిట్టవు. కాని పుట్టటం, చావటం మాత్రం అందరికీ ఒకేవిధంగా ఉంటోంది. ఇది అందరికీ వర్తించే సార్వభౌమికమైన సత్యం. మానవులం కాబట్టి, బుద్ధి జీవులంకాబట్టి, జ్ఞానవంతులం కాబట్టి ప్రక్క నున్నవారి మతవిశ్వాసాలను గూర్చి కూడా కొంతైనా తెలుసుకోవటం అవసరం.

## 9. ఇతర మతాల్లో పరలోకం పునర్జన్మ:

పునర్జన్మను గురించీ, పరలోకాన్ని గురించీ ఇతర మతాలు ఏమి చెపుతున్నాయో తెలుసుకోవటం ఆసక్తికరంగా ఉంటుంది. అప్రస్తుతమూ కాదు.

హిందూమతం లాగానే యూదుమతంకూడా కర్మనుబట్టి పునర్జన్మ ఉంటుందని చెపుతుంది. మృతుల పునరుత్థానాన్ని విశ్వసిస్తుంది. సత్కర్మల నాచరించినవారికి మాత్రమే మంచిజన్మ లభిస్తుంది. వారికే దేవుని సామీప్యం లభిస్తుంది. మిగతా దుష్టులంతా పశుప్రాయులుగా నశిస్తారు. స్వర్గనరకాలను గురించిగానీ, పునర్జన్మను గురించిగానీ యూదుమతం ఖచ్చితంగా ఏదీ చెప్పదు. మతాచార్యులు భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేశారు. పునరుత్థానం విషయంలోనే తరువాత వచ్చిన మతాచార్యులు ఏకీభవించటంలేదు. దుష్టులైన వారికి నరకవాసం (జహన్నుమ్) పండ్రెండు నెలలు అని చెపుతుంది. ధర్మపరాయణులైనవారు శాశ్వతంగా భగవత్సాన్నిధ్యంలో ఉంటారని విశ్వసిస్తుంది. అంటే కొంచెం ఇంచుమించుగా స్వర్గవాసం అన్నమాట. నరకమనేది ఉన్నట్లు చెప్పలేదు. నరకమనేది ఆమతంలో తరువాత వచ్చిన కల్పన. ఆరంభంలో ఆ మత గురువులు ధర్మపరాయణులకు భగవత్సాన్నిధ్యం ఉంటుందనీ, ఆచట తినటం, త్రాగటం వగైరాలు ఉండవు. శరీరం ఉండదు. కాని శిరస్సున (Shekhinah) కిరీట దీప్తులతో ప్రకాశిస్తూ ఉంటారు. శరీరం లేనప్పుడు కిరీట దీప్తులేమిటి? అంటే, భవిష్యజ్జీవితానికి సంబంధించిన జ్ఞానదీప్తికే, ఆ కిరీట దీప్తి ప్రతీక అటారు. 'TORAH' (The Law) and the Commandments. భగవంతుని శాసనాలను పాటించనివారు నరకానికి పోతారు. నరకవాసం శాశ్వతమా? పరిమితమా? అనే విషయం యూదుతత్త్వ శాస్త్రం చెప్పటంలేదు.

బౌద్ధమతం కూడా మానవుని శరీరం భౌతికంగా నశించటంతో అతని జీవితం అంతంకాదు అని చెపుతుంది. అంటే పరలోకం ఉందని చెపుతుందన్న మాట. ఏమని అంటుంది? అంటే పునర్జన్మగానీ, నిర్వాణంగానీ, ఉన్నదనీ

అంటుంది. ఈ జన్మలో చేసిన కర్మలే తరవాతి జన్మను నిర్ధారిస్తాయి. ఏవిధమైన ఆసక్తీలేకుండా నిష్కామకర్మలా చరించినవారికి నిర్వాణం (మోక్షం) లభిస్తుంది. సంగంతో చేసిన పని సంస్కారరూపంలో పునర్జన్మకు కారణ మౌతుంది. ఆ పనులు సత్కర్మలైతే మంచి జన్మ. దుష్కర్మలైతే నీచ జన్మ లభిస్తుంది. స్వర్గనరకాలను గూర్చిన ప్రసక్తి లేదు. నైతికనియమ నిబంధనలకు ప్రాధాన్యత ఎక్కువ. మనకర్మల బాగోగులను నిర్ణయించేవాడూ, తీర్పు చెప్పేవాడూ, దేవుడనేవాడు లేదు.

ఈ మతంలో వచ్చిన చిక్కు ఏమిటంటే, మానవునితో అనశ్వరమైన శాశ్వతమైన ఆత్మ అంటూ ఏదీలేదని చెపుతూనే, ఒక శరీరం నుండి మరొక శరీరాన్ని పొందటం, నిర్వాణాన్ని పొందటం అనేవి పరస్పర విరుద్ధంగా ఉండే మాటలు. వారి క్షణికవాదం పునర్జన్మకు మోక్షానికీ విరుద్ధంగా కనిపిస్తుంది. బుద్ధుడు జీవుని నిత్యత్వానికి ఒకదీపజ్వాలను ఉదాహరణగా చెప్పాడు. ఒక జ్వాల రెండవ దీప జ్వాలను వెలిగించి ఆరిపోయినట్లు ప్రస్తుత జన్మ యొక్క చివరి జ్ఞానము ఉత్తరజన్మయొక్క మొదటి జ్ఞానానికి కారణమౌతుందని చెప్పి జన్మ పరంపర అనుస్యూతంగా వస్తుందని అంటారు. ఇట్లా అనశ్వరమైన ఆత్మను అంగీకరించకపోయినా పునర్జన్మ సాధ్యమేనంటారు. జన్మపరంపర ఎడతెగని ప్రవాహం లాంటిదని వారి ఉద్దేశ్యం.

ఈ విషయంలో జైనుల ఆలోచనావిధానం హిందూవేదాంత పద్ధతిని పోలి ఉంటుంది. ఆత్మశాశ్వతమనీ, శరీరంతోపాటు నశించదనీ అంగీకరిస్తారు. మరణించిన వెంటనే మరొక జన్మవస్తుందనీ, ఆజన్మ, పూర్వజన్మలోని కర్మలను బట్టి ఉంటుందనీ అంగీకరిస్తుంది. క్రొత్త జన్మలోని కుటుంబస్థితి, శారీరకస్థితి, ఆర్థిక సామాజిక స్థితిగతుల్నీ వెనుకటి జన్మలోని కర్మలను బట్టి వస్తాయని చెపుతుంది. మమకారంలేకుండా నిస్సంగత్వంతో జీవితాన్ని గడిపితే మానవజన్మ వస్తుందనీ, కోరికలతో, మమకారాలతో, ఆసక్తి, దురాశ మొదలైన దుర్గుణాలతో జీవితం గడిపితే పశ్వాదిజన్మలు వస్తాయనీ చెపుతుంది. స్వర్గ నరకాలకు ప్రత్యేక ఉనికిని చెప్పకపోయినా, మంచి జన్మను పొందటం, నికృష్ట

జన్మను పొందటంగా అంగీకరిస్తారు. ఉత్తరజన్మకు పూర్వజన్మసంస్కారాలు కారణమౌతాయన్నమాట. ఆత్మ తన నిజస్థితిని పొందటానికై (మోక్షాన్ని పొందటానికై) అనాసక్తకర్మము, సదాచరణము ముఖ్యము.

**జురాస్ట్రియనిజం :**

నేటి పార్సీమతం- ఒకవిధంగా హిందూ కర్మసిద్ధాంతాన్ని అంగీకరిస్తున్నట్లే కనిపిస్తుంది. పాపకర్మలకు నరకప్రాప్తినీ, పుణ్యకర్మలకు స్వర్గప్రాప్తినీ చెపుతుంది. పాపులకు కూడా పాపక్షయం అయిన సిమ్మట సద్గతి కలుగుతుందని చెపుతుంది- మానవుడు క్రమంగా పరిపూర్ణతను పొంది, భగవంతుని సాయుజ్యాన్ని పొందే అర్హతను సంపాదించుకొంటాడు. అహురమజుడా (పరమాత్మ) స్వతః దయామయుడు. కాబట్టి పాపులనుకూడా కరుణిస్తాడు. పాపక్షయం అయ్యేంతవరకు జన్మ పరంపర ఉంటుంది. స్వర్గనరకాలు ప్రత్యేక ప్రదేశాలు కావు. మనస్సే స్వర్గాన్నైనా, నరకాన్నైనా, కల్పించ గలుగుతుంది- మార్చగలుగుతుంది. కాబట్టి మనః ప్రవాహం కలుషితం కాకూడదు.

యూదు మత సిద్ధాంతాలను ఆధారంగా గ్రహించే క్రైస్తవ, మహమ్మదీయ మతాలు వికసించినాయి. కాబట్టి మరణం పరలోకం పునర్జన్మలను గూర్చిన వీరి విశ్వాసాలు యూదుమత విశ్వాసాలకు దగ్గరగానే ఉంటాయి. క్రైస్తవమతం పునరుత్థానాన్ని చెపుతుంది. క్రైస్తవుల్లోనే కొన్ని శాఖలవారు ఆత్మ పునరుత్థానాన్ని చెందటం విశ్వసించరు. (పునరుత్థానం పునర్జన్మకాదు) పాతి పెట్టబడినది అత్మకాదు, శరీరం ! ఆత్మను పాతిపెట్టటం, ఆ ఆత్మయే మళ్ళీ లేచిరావటం అసంభవం. శరీరం సైతం లేచిరాదు. హిందూ వేదాంతం చెప్పినట్లుగా క్రీస్తు యొక్క అత్మశక్తి మళ్ళీ వ్యక్తమై, తనశిష్యులకు, అనుచరులకు మార్గదర్శకం చేసి ఉండవచ్చు. గోరీనుండి క్రీస్తు లేచిరావటం వేయించిన చేపమాంసాన్ని తేనెను తిన్నాడనటం ఈ విధమైన కల్పనలను చాలమంది క్రైస్తవులే అంగీకరించరు.

క్రైస్తవ మతం మరొక జన్మను అంగీకరిస్తుంది. ఈ విషయంలో వారు The Day of Judgement, Resurrection of the Dead and the assignment of Heaven or Hell అనే మూడు ముఖ్య విషయాలను పేర్కొంటారు. అంటే న్యాయ నిర్ణయదినం, పునరుత్థానం. పాపపుణ్యాలనుబట్టి స్వర్గనరకాలను ఇవ్వటం అనే మూడు సిద్ధాంతాలను చెపుతారు. కాబట్టి ఈమతం యూదు, ఇస్లాం మతాలకు ఈ విషయంలో భిన్నమైనది కాదని తోస్తుంది. పునరుత్థానం చెందేటంతవరకు ఆత్మయొక్క గతి ఏమిటి? అనే ప్రశ్నకు రెండు రకాల గతిని చెపుతారు 1) విశ్వన్యాయ నిర్ణయము. 2. వ్యక్తిగత న్యాయనిర్ణయము. మొదటిది మహాప్రళయం జరిగినప్పుడు జీవాత్మలన్నింటికీ జరిగే న్యాయ నిర్ణయం. రెండవది వ్యక్తిగతంగా లభించే తీర్పు. సత్కార్యాచరణులు స్వర్గానికి నేరుగా పోతారు పాపులు క్రమేణా పశ్చాత్తాపాదులతో శుద్ధి కావింపబడి దైవసాన్నిధ్యాన్ని చేరతారు.

ఇస్లాంమత విశ్వాసాలు అన్ని విషయాల్లోలాగానే ఈ విషయంలో కూడా జొరాష్ట్రియనిజం, యూదుమత విశ్వాసాల కలయికగా కనిపిస్తుంది. అంతిమనిర్ణయదినం (Final Judgement day ఖయమాత్‌కాదిన్) ఉన్నదనీ, చనిపోయినవారంతా అనాడు సమాధుల్లోనుండి లేస్తారనీ వారివారి పాపపుణ్య కర్మలననుసరించి, నరకమో స్వర్గమో ఉంటుందనీ ఈ మతం చెపుతుంది. వారీరకమైన మరణం ఆత్మకు చివరిది కాదనీ, అంతిమ న్యాయనిర్ణయం దాకా ఉంటుందనీ చెపుతుంది. పైగా ఈ ఆత్మలు న్యాయ నిర్ణయదినం నాడు తమ తమ శరీరాలను ధరించి సమాధుల్లో నుండి లేచివస్తాయనీ, వీటిని దేవదూతలు, అల్లాఎదుట హాజరుపరుస్తారనీ, అల్లా వారి వారి కర్మలకు తగినట్లు స్వర్గ నరకాలను నిర్ణయిస్తాడనీ వీరి నమ్మకం. ఆ ఆ న్యాయ నిర్ణయదినం వచ్చేటంతవరకు ఇవన్నీ ఒకచోట (al- Berzahk) అల్‌బెర్‌జక్ అనేచోట ఉంటాయని అంటుంది. వారిమత గ్రంథమైన ఖురాన్‌లో స్వర్గ నరకాలు కండ్లకు కట్టినట్లు వర్ణింపబడ్డాయి. హిందువుల గరుడ పురాణంలో లాగా ఏడు రకాల స్వర్గాలు, ఏడు రకాల నరకాలు చెప్పబడ్డాయి. స్వర్గనరకాలు ప్రత్యేక స్థలాల లాగానే వర్ణింపబడినాయి.

సిక్కుమత విశ్వాసాలు, పరలోకం, పునర్జన్మ విషయాల్లో, హిందూ విశ్వాసాలకు చాలాదగ్గరగా ఉంటాయి. కర్మ సిద్ధాంతాన్ని అంగీకరిస్తుంది. పూర్వ కర్మనుబట్టి ప్రస్తుత జన్మ ఉంటుంది. ఆత్మకు చావు లేదు. ఎటువంటి కర్మవల్ల ఎటువంటి జన్మ వస్తుందో చెప్పకపోయినా పూర్వకర్మమే ప్రస్తుత జన్మకు కారణం అంటుంది. "ఓ భగవానుడా! నేను అనేకసార్లు చెట్టుగా పుట్టాను. జంతువులుగా పుట్టాను. పక్షులుగా పాములుగా పుట్టాను." అంటూ చేసిన ప్రార్థనలను బట్టి 'కర్మవల్ల జన్మ' అనే సిద్ధాంతం వ్యక్తమౌతోంది. సత్కర్మాచరణం వల్ల మంచిజన్మ దుష్కర్మాచరణం వల్ల నీచజన్మ వస్తుందని ఈ మతం చెపుతుంది.

ఇంతవరకు చెప్పుకొన్న దానిని బట్టి తేలిన సారాంశం ఏమటంటే 1. ప్రపంచంలోని అన్నిమతాలు. ఈ శరీరం చనిపోవటంతో అంతంకాదనీ, పునర్జన్మ, పరలోకం ఉంటాయనీ చెపుతున్నాయి. 2. శరీరానికి తప్ప ఆత్మకు చావులేదు. 3. ఈ జన్మలోని కర్మనుబట్టి తరువాతి జన్మ ఉంటుంది. ఈ విషయాల్లో ఏకాభిప్రాయం కనిపిస్తుంది.

మరికొన్ని విషయాలలో హిందూమతంలో నుండి వచ్చిన బౌద్ధ, జైన, సిక్కు మతాల విశ్వాసాలు ఒక విధంగా ఉన్నాయి. యూదు, క్రైస్తవ, ఇస్లాం మతాల విశ్వాసాలు మరొక విధంగానూ ఉంటున్నాయి. మృతాత్మల పునరుత్థానం మొదలైన విషయాల్లో వీటికి యూదు, క్రైస్తవ, ఇస్లాం మాతాలకు ఏకీభావం ఉంది.

ఇక హిందూమాతానికి సంబంధించిన పురాణాల్లో చెప్పబడిన స్వర్గనరకాలు, యముడు, చిత్రగుప్తుడు మొదలైన వృత్తాంతాలు యూదుక్రైస్తవ, ఇస్లాం లాంటి మతాలలో చెప్పబడిన అంతిమ న్యాయనిర్ణయ దినంలో జరిగే కార్యక్రమాన్ని పోలి ఉన్నాయి. ఇటువంటి కల్పనలు బౌద్ధజైన మతాల్లో కన్పించవు. వారు ఆత్మను, నిత్యత్వాన్నీ ఒప్పుకోరు కాబట్టి.

హిందూమతం కూడా వేదాంతపరంగా స్వర్గనరకాలు ప్రత్యేక ప్రదేశాలుగా ఉన్నట్లు చెప్పదు. అజ్ఞానులను సన్మార్గంలో నడిపించి, తద్వారా

జ్ఞానులను చేసి, ఆత్మస్వరూప సాక్షాత్కారం కలిగించటానికై పురాణాదుల్ని సాధనాలుగా చెపుతుంది. వాటినే పరమావధిగా చెప్పదు. కాబట్టి పురాణాదులనే హిందూమతంగా భావించరాదు. అట్లాగే ఇతర మతాల వారి గ్రంథాలను, వాటిలోని విషయాలను మనం చూడాలి.

అన్ని మతాలు ఈ జన్మకు పూర్వజన్మకర్మయే కారణం అంటున్నాయి కాబట్టే, మన ప్రవర్తన సరిగా ఉండటానికై అన్ని మతాలు, అనేక నైతిక విధులను, ఆదేశాలను చెప్పినాయి. తద్వారా మన ప్రవర్తనను సరిదిద్దుకోవటం మానవుని కర్తవ్యం.

## మోక్షములేక జన్మరాహిత్య స్థితి :

ఈ ప్రపంచంలో జన్మను పొందిన క్షణం నుండి మనం కర్మను చేస్తూనే ఉన్నాం. పుణ్యకర్మలు, పాపకర్మలు, పుణ్యపాప విభేదంలోనికి రానికర్మలు. సత్యాచరణం, అహింస, పరోపకారం, లాంటివి పుణ్యకర్మలైతే, అసత్యాచరణం పరపీడనం, హత్యలు, దొంగతనాలు వగైరాలు పాపకర్మలు. అన్న పానాదులను గ్రహించటం, ఊపిరిపీల్చటం, విసర్జనక్రియలు ఇవన్నీ పుణ్యపాప విభేదంలోకి రాని సహజ కర్మలు.

పుణ్యపాపకర్మలే మనకు పునర్జన్మ నిస్తున్నాయని అన్ని మతాలు చెపుతున్నాయి. పునర్జన్మ, కర్మఫలభోగం లేకుండా పోవాలంటే కర్మక్షయం పూర్తిగా జరగాలి. అప్పుడిక జన్మ ఉండదు. జన్మరాహిత్యాన్నే మోక్షమనీ, నిర్వాణమనీ, ముక్తి అనీ అనేక పేర్లతో వ్యవహరిస్తారు. పుణ్యకర్మలకు కూడా ఫలం ఉంటుంది. కాబట్టి, ఆ ఫలాన్ని అనుభవించటానికైనా జన్మ అవసర మౌతుంది. కాబట్టి జన్మరాహిత్య స్థితి అంటే ఆత్మ **స్వరూపంలో ఉండటం–మోక్షం.**

అన్నిమతాలూ మోక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా, ఒక్కొక్కమతం ఒక్కొక్క విధంగా చెప్పినట్లు కనిపిస్తుంది. బౌద్ధ మతం దుఃఖక్షయరూపమైన నిర్వాణమును ప్రతిపాదించింది. ఈ శరీరంతోనే ఆ నిర్వాణాన్ని

పొందవచ్చునుని చెప్పింది. అంటే నిష్కామకర్మద్వారా, జ్ఞానం ద్వారా నిర్మాణాన్ని- మోక్షాన్ని- పొందవచ్చుననటంలో ఉపనిషత్రృతిపాదితమైన జీవన్ముక్తస్థితి మనకు స్ఫురిస్తుంది. జైనమతం కూడా కొంచెం ఇంచుమించుగా ఈవిధమైన దుఃఖరహిత స్థితిని- కైవల్యాన్ని- నిర్వాణాన్ని- చెప్పింది. భౌతికపదార్థంతో ఆత్మకున్న సంబంధం తొలగిపోవటం. అప్రవాహాన్ని నిరోధించటం- ద్రవ్య సంపర్క దోషం అంటకుండా ఉండటం. అదే జీవన్ముక్తి.

జొరాష్ట్రియన్ మతము మానవసేవద్వారా మోక్షాన్ని చెప్పింది. అంటే మనస్సన్యాసము, మానవసేవ, నిష్కామ కర్మలకు ప్రాధాన్యమిచ్చినది. కేవలం సన్న్యాసం ద్వారా మోక్షసాధనకోసం యత్నించటాన్ని నిరసించింది.

మొత్తానికి అన్ని మతాలూ మోక్షమనే మాటను ఏదోరూపంలో వాడుతున్నా వారి భావాల్లో భేదం కనిపిస్తుంది. ముక్తుడైనవాడు తనమానవత్వ స్థితిని అతిక్రమించి, తన వ్యక్తిత్వం లోపించిపోవటాన్నే మోక్షంగా భావిస్తున్నారు. భారతీయ అద్వైతవాదం ముక్తుదు సాక్షాత్తుగా పరమాత్మయే అవుతాడని చెపుతుంది.' 'జీవోబ్రహ్మైవ నాపరః" అనేది అద్వైత వాద సారాంశంగా చెప్పవచ్చు. జీవుడు తన జీవభావాన్ని వదలి స్వరూప స్థితిని పొందటం మోక్షం. బౌద్ధులు చెప్పే నిర్వాణం, కైవల్యం మొదలైన పదాలన్నీ ఈ విధమైన మోక్షాన్ని సూచించేవే!

అట్లా అద్వైత భావాన్ని పొందకుండా, తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూనే మానవుడు మోక్షస్థితిలో ఉండవచ్చునని క్రైస్తవ మతం చెపుతుంది. ఇది ద్వైతభావంతో కూడినది. క్రైస్తవమతంలోనే సన్న్యాసంద్వారా మోక్షాన్ని చెప్పిన వారున్నారు. అయితే జైనులు కూడా ఈ విధమైన సన్న్యాసంద్వారా మోక్షాన్ని చెప్పిన వారున్నారు. అయితే జైనులు కూడా ఈ విధమైన సన్న్యాసమతాన్ని చెప్పారు. యదార్థానికి క్రైస్తవమతంలో మోక్షసాధన లేదనే చెప్పాలి. ఇస్లాం మతంలో మోక్షాన్ని పొందటానికి ఒక మార్గాన్ని ప్రత్యేకంగా అవలంబించాల్సిన అవసరం లేదు. వారిమోక్ష సిద్ధాంతం ప్రకారం పాపియైనవాడు అల్లాను స్మరిస్తేచాలు. అతనిని క్షమాపణకోరితేచాలు. వెంటనే అల్లా క్షమించి మోక్షాన్ని యిస్తాడు.

## కర్తవ్యం:

ఇంతవరకు మరణం, పరలోకం, పునర్జన్మలనుగూర్చి కొంతవరకు చెప్పుకొన్నాం. ఉత్తరార్థాన్ని చదవబోయేముందు కొన్ని విషయాలను గూర్చి కొంతవరకు చెప్పుకొన్నాం. ఉత్తరార్థాన్ని చదవబోయేముందు కొన్ని విషయాలను గూర్చి ఆలోచించాల్సి ఉంది. మానవుడు జన్మతోనే దేవపితృమనుష్య ఋణాలతో పుడతాడనీ, ఆ ఋణాలను మానవుడు తీర్చుకోవాలనీ శాస్త్రాలు చెపుతున్నాయి. ఇందులో పితృణం అనేది ఈ సందర్భంలో ముఖ్యమైనది. సంతానకాంక్ష అనేది జీవజంతువులన్నింటికీ సహజమే అయినా, మానవుడు తన సంతానం ద్వారా పరలోకాన్నీ, ఉత్తమ జన్మనీ కోరుకుంటున్నాడు. పుత్రులు లేనివానికి గతులులేవనీ, పుత్రుని వల్లనే తనకు సద్గతి లభిస్తుందనీ నమ్ముతున్నాడు. పుత్రికవల్ల కన్యాదానం ద్వారా పితరులకు బ్రహ్మలోక ప్రాప్తినీ, పుత్రసంతానంద్వారా ఉత్తమలోకాలనూ కోరుతన్నాడు. అందుకే సంతానం కలగక పోతే పెంచుకుంటున్నాడు.

కాబట్టి, తల్లిదండ్రులకు ఉత్తమలోకాలను కలిగిం చటం పుత్రధర్మమైంది. ఆ ధర్మాన్ని నిర్వర్తించటానికే పరలోక క్రియలాచరిస్తున్నాం. కాబట్టి, మనంచేసే అంత్యేష్టి క్రియల అర్థప్రయోజనాలను తెలుసుకోవాల్సి ఉంది. అందుకే, మరణోత్తరకర్మలను, గూర్చి సంక్షేపంగా ఉత్తరార్థంలో చెపుతున్నాం.

## ఉత్తరార్థం –అంత్యేష్టి

### 1. విషయ ప్రవేశం :

ఏ దేశానికి చెందినా, ఏమతానికి, ఏకులానికి ఏజాతికి చెందినా ప్రతివానికీ జన్మలాగానే మరణం అనేది కూడా ఒకే విధంగా ఉంటోంది– ఒక్కొక్కడు మరణించే కారణం వేరుగా ఉండవచ్చు. ఈ జన్మమరణాల మధ్యలో నడచే జీవితంలోని ఇతర సంస్కారాల్లో విశ్వాసాల్లో, ఎన్నెన్ని భేదాలున్నా జన్మమరణాలు మాత్రం ఆస్తికులకు నాస్తికులకు, జ్ఞానులకు అజ్ఞానులకు, అన్ని

మతాలవారికీ, ఒకేవిధంగా సంభవిస్తున్నాయి. పుట్టినవానికి చావు తప్పదనేది పండితునికీ పామరునికీ సమానంగా తెలిసిన సత్యం. తప్పించుకోవటానికి వీలులేనిది. ఎంతటి గొప్ప వానికైనా మరణం తప్పదు.

పుట్టుక అనేది ఐహిక జీవితానికి ఆరంభం అయితే, మరణం అనేది ఐహిక జీవితానికి అంతం అన్నమాట. అయితే మరణం తరువాతి జీవితం (పరలోకం) విషయంలోను, పునర్జన్మ విషయంలోనూ, భిన్నాభిప్రాయాలూ, భిన్నవిశ్వాసాలూ ఉన్నాయి. అది కంటికి కనిపించే విషయంకాదు. ఊహకు విశ్వాసానికి సంబంధించిన విషయం కాదు కాబట్టి! జీవితం అంటే మృత్యువు నుండి తప్పించుకోవటానికి చేసే ప్రయత్నంలాగా కనిపిస్తోంది. పశు పక్ష్యాదులు, క్రిమికీటకాదులు సైతం మృత్యుభయంతో, జీవితం మీది ఆసక్తితో, ఆశతో, మృత్యువునుండి తప్పించుకొనేందుకు అనుక్షణం ప్రయత్నిస్తున్నాయి. తెలివిగల మానవుడు పుట్టినప్పటినుండీ, పుట్టటానికి ముందునుండీ కూడా మరణం నుండి తప్పించుకోవటానికీ, దీర్ఘాయుర్దాయం కోసమూ సీమంత పుంసవన, జాతకర్మాది వివిధ సంస్కార విధులను చేస్తున్నాడు. అన్ని విధుల్లోనూ 'ఆయుష్యాభివృద్ధ్యర్థం' అనే సంకల్పం కనిపిస్తుంది.

అయితే, ఎన్ని విధులాచరించినా, ఎన్ని సంస్కారాలు చేసినా, ఎన్ని జాగ్రత్తలు వహించినా, మృత్యువనేది తప్పదు అనే పరమసత్యం తెలిసింది. మృత్యువు తరువాత కూడా, జీవితం (పరలోకజీవితం) ఉన్నదని ఊహించాడు. పునర్జన్మ ఉన్నదని, విశ్వసిస్తున్నాడు. గతజన్మలోని సంస్కారరూపంలో ఉండిన మరణభయమే ఈ జన్మలో పిపీలికాది సమస్త జీవుల్లోనూ కనిపిస్తున్నట్లు గ్రహించాడు. నిద్రలోను కొన్ని రోగాల్లోను, కొన్ని మందుల ప్రభావం వల్లనూ, స్పృహ కోల్పోవటం కూడా తాత్కాలిక అల్ప వ్యవధి కల మృత్యువనీ, మరణం అనేది దీర్ఘమృత్యువనీ ఊహించి గ్రహించాడు. కాబట్టే మృత్యువు తరువాత, మళ్లీ జన్మ ఉన్నదనీ, పరలోకం అనేది ఉన్నదనీ ఊహించాడు. పుట్టినప్పటినుండీ చేసే సంస్కార పరంపరతో ఈలోకాన్నీ, మరణానంతరం చేసే సంస్కారాలతో పరలోకాన్నీ జయించవచ్చునని విశ్వసించాడు– (జాత

సంస్కారేణాముం లోకం అభిజయతి మృతసంస్కారేణాముం లోకం..... (బోధాయన పితృమేధ సూత్రాలు-3-1-4) అందుకే పరలోక విజయం కోసం మరణోత్తర కర్మల్ని సృష్టించుకున్నాడు. (మన మతంలో ఎన్నికులాలు, శాఖలు, సంప్రదాయాలు ఉన్నా, అందరికీ ఈ సంస్కారవిధులు ఆచరణీయాలుగానే ఉన్నాయి. స్వల్పమైన భేదాలు ఉన్నా ఒకే పద్ధతిలో ఈ విధులు జరుగుతున్నాయి. వీటి ఉద్దేశ్యంలోను ఆశించే ప్రయోజనంలోనూ తేడాలేదు)

## 2. కర్మకాండలు- కారణాలు:

ఈ అంత్యేష్టికి సంబంధించిన వివిధ కర్మకాండలకు కారణాలు ఈ దిగువ విధంగా కనిపిస్తాయి.

1. మరణమంటే కలిగిన భయం. ఇది జీవులన్నింటికీ సహజమే! పిపీలికాది బ్రహ్మపర్యంతం సహజంగా కనిపిస్తున్నట్టే!
2. మృత్యువు తరువాత కూడా జీవితం ఉన్నదనే సిద్ధాంతం. ఇది మానవుల్లోనే కనిపిస్తుంది. అన్నిజాతులవారిలో, దేశాలవారిలో కనిపిస్తోంది. పశుపక్ష్యాదుల్లో లేదు. అంటే వాటికి ఇటువంటి జ్ఞానం ఉన్నట్లు మనకు తెలియటంలేదు.
3. జీవితం అంటే ప్రేమ. ఇది అన్ని జీవులకూ సహజమే.
4. చచ్చినవాడు చావగా, మిగిలిఉన్నవారి (సంఘంయొక్క) శారీరక అవసరాలకోసం, (ఆరోగ్యంకోసం) సుఖజీవనం కోసం, ఈ భావన పశుపక్ష్యాదులకు లేదు. బహుశః ఆదిమ మానవునికి కూడా లేదేమో!

ఈ నాలుగు ప్రధాన విషయాలను విపులంగా విశ్లేషించి చూస్తే, ఈ మరణోత్తర సంస్కారాల్లో నిహితమైయున్న రహస్యాలు మనకు గోచరిస్తాయి. వరుసగా వీటిని గురించి ఆలోచిద్దాం.

## 3. మరణమంటే భయం:

మరణభయం అన్ని జీవరాసుల్లోనూ కనిపిస్తుంది. మనం గ్రహించలేక పోయినా, చెట్లు చేమల్లో కూడా ఉంది. మరణంనుండి తప్పించుకోవటానికి

జీవరాసులన్నీ ప్రయత్నిస్తున్నాయి. కాని, మనస్సు బుద్ధి, బాగా పరిపక్వస్థితికి వచ్చిన మానవునిలో స్పష్టంగా కనిపిస్తుంది. మరణసమయంలో జీవుడు బాధపడుతున్నట్లు కనిపిస్తుంది. పైగా మరణమనేది, జననంలాగా ప్రకృతి సిద్ధంగా, దానంతట అదే సులభంగా సంభవిస్తున్నట్లు కనపడటంలేదు. రోగాలు, ప్రమాదాలు, బలవన్మరణాలు, ఆత్మహత్యలు ఇట్లా వివిధరూపాల్లో కనిపిస్తున్నది. గత జీవితాన్ని పూర్తిగా కుదిపివేసే, కలచివేసే సంఘటనలాగా, మిగిలిఉన్న వారి జీవితాలను అంధకారబంధురం చేసేదానిలాగా కనిపిస్తోంది. కాబట్టి, మరీ భయానకం అవుతోంది. మరణంతో, అంతవరకు ఆవ్యక్తితో ఉంటూ వచ్చిన సంబంధ బాంధవ్యాలన్నీ అంతమౌతున్నాయి. కాబట్టి, మిగిలి ఉన్నవారికి, ఒకవిధమైన వ్యాకులపాటు కలుగుతోంది. మృత్యువనేది, తప్పనిసరి అనీ, తప్పించుకోవటానికి వీలుకానిదనీ తెలిసినా, తప్పించుకోవటానికి ఉపాయాలను అన్వేషించటం మానవుడు మానలేదు– తన పలాయనాన్ని, అసమర్థతను తాను అంగీకరించటంలేదు. మృత్యువునుండి తప్పించుకోవటానికి అనేక వ్యర్థ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. ఇట్టి ప్రయత్నాలవల్ల పుట్టినవే పరంపరగా వస్తూన్న ఆదిమకర్మకాండలన్నీ! మృత్యువనేది జీవితానికి స్వాభావికమైన అంతం' అనే పరమసత్యాన్ని అంగీకరింపక తప్పదు. అందుకే ఆ మృత్యువును, ఆ మృత్యువు తరువాతి జీవితాన్నీ కొంత సరళతరం చేయటానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాడు. అందుకే బౌధాయన గృహ్య సూత్రాల్లో యిట్లా అన్నారు.

"జాతస్యవై మనుష్య స్య ధ్రువం మరణమితి విజానీ యాత్తస్మాజ్జాతే న ప్రహృష్యేన్మృతే చ న విషీదేత్ (2)".

"అకస్మాదాగతం భూమకస్మాదేవగచ్ఛతి. తస్మాజ్జాతం మృతంచైవ సంపశ్యన్తి సుచేతనః తస్మాన్మాతరం పితరమాచార్యం పత్నీం పుత్రం శిష్యమంతేవాసినం మాతులం సగోత్రమసగోత్రం వా దాయముపయచ్ఛేద్దహనం సంస్కారేణ సంస్కుర్వన్తి (33)".

## 4. మృత్యువు తరువాతి జీవితాన్ని గూర్చి :

మృత్యువు తరువాతకూడా జీవితం అనేది ఉన్నదని అనాదిగా మానవుడు విశ్వసిస్తూ వస్తున్నాడు. ఈ విషయంలో అతనికి అనేక ప్రమాణాలు కనిపిస్తున్నాయి. పునర్జన్మను గూర్చి, మరణానంతర జీవితాన్ని గూర్చి ఇంచుమించుగా అన్నిమత గ్రంథాలూ ముక్తకంఠంతో అంగీకరిస్తున్నాయి. నిద్రతరువాత, స్వప్నంతరువాత, రోగంలో వచ్చే మత్తు తరువాత మానవుడు మేల్కొంటున్నట్లే, దీర్ఘనిద్ర అయిన మృత్యువు తరువాత కూడా జీవునికి పునర్జన్మ ఉందనే నమ్మకానికి బలం చేకూరుతోంది. అయితే, నిద్ర మొదలైన వాటి విషయాల్లో శరీరం పాడవటం లేదు, ఊపిరి అగటంలేదు– ప్రాణక్రియ జరుగుతోంది. మరణంలో మాత్రం ప్రాణక్రియ ఆగిపోవటం, శరీరం క్రుళ్ళి పాడైపోవటం కనిపిస్తోంది. జీవునికి శరీరంతో కలిగే ఈ రెండు వియోగాల్లోనూ కనిపిస్తున్న భేదం ఇదే! కాబట్టి, ఈ శరీరం లేకపోయినా జీవునికి (మళ్లీ జన్మించేవరకు ఏదో ఒక విధమైన జీవితం ఉన్నదనే విశ్వాసమే మృతసంస్కారాలకు నాంది అవుతోంది.

## 5. జీవితం మీద ప్రేమ :

ఈ జీవితం మీద, ఈ శరీరంమీద ఉన్న ప్రేమ, స్నేహంతోపాటు, ఈ శరీరం పోతుందేమోననే భయంకూడా ఉంటోంది. మృతునికి ఈ శరీరంమీద ఉండే ఈ స్వార్థమే, మమకారమే, తన చుట్టుపక్కాలతోడి, ఆప్తులతోడి సంబంధాన్ని వదలటానికిష్టపడకుండా ఉండేటట్లు చేస్తోంది. కాబట్టి, తన వారితోడి సంబంధాన్ని వదలుకోలేక, జీవుడు, ఆయింట్లోనో, చుట్టుప్రక్కలో తిరుగుతూ ఉంటాడనీ, పైగా, (జీవుడు) తన యిష్టులకు వియోగాన్ని కలిగించి, వారిని బాధపెట్టరాదనీ, వారికి లోటు కలిగించరాదనే భావంతో ఉంటాడనీ నమ్మకం బలపడుతోంది. ఈ విధమైన బాధను, దుఃఖాన్ని తగ్గించటానికి కూడా కొన్ని కర్మకాండలు ఏర్పాడ్డాయి.–“తండ్రీ! నా పితృదేవతలు అంతా ఏ మార్గానవెళ్లినారో, ఏ స్థలాన్ని చేరినారో, నీవుకూడా ఆ మార్గాన అస్థలానికి

చేరుము; అని చెప్పే. "ప్రేహి ప్రేహి పథిభిః పూర్వ్యభిర్యత్రా నః పూర్వేపితరః పరేయుః ఉభారాజానా స్వధయా మదన్తా యమం పశ్యాసి వరుణం చ దేవం." (ఋ.వే. 10-14-7) అట్లాగే, (అధర్వవేదం 18-1-54 లోను, పా.గృసూ. 3-10-24) లోనూ ఉన్న మంత్రాలు, శ్లోకాలు. ఈ ఔపచారిక వియోగాన్నే సూచిస్తున్నాయి. "మైనమగ్నే విధహోమాభిశోచో మాన్యత్వ చంచిక్షిపో మా శరీరం యదా శృతం కృణవో జాతవేద్యోథేమనం ప్రహిణుతాత్ పితృభ్యః" (ఋ.వే. 10-16-1) "ఓ అగ్నిదేవుడా! ఈ ప్రేత (మృతుడు) మంచివాడు. ఇతనిని భస్మం చేయటం తగదు. ఈ మంచివాడైన మృతునికి దుఃఖాన్ని కలిగించటం తగునా? ఈతని చర్మాని, శరీరాన్ని చీల్చటం తగునా?" "శ్రుతం యదాకరసి జాతవేద్యోథేమేనం పరిదత్తాత్ పితృభ్య= యదా గచ్ఛాత్మసునీతి మేతా మధా దేవానం వశనీర్భవాతి" (ఋ.వే. 10-16-2)" ఈ ప్రేత యొక్క శరీరాన్ని దగ్ధం చేస్తున్నావు. ఆ శరీరాన్ని పితృవీరులకు ఇమ్ము. ప్రేత, యిట్లా దగ్ధుడై, చావకుండా, దేవతలకు అప్పగింపబడుగాక (ఆత్మకు చావు లేదు కాబట్టి, శరీరం కాలిపోగా జీవాత్మ దేవలోకాన్ని చేరుతుందని భావం)

ఇట్లా మృతునితోడి వియోగవ్యధను, దయనీయంగా వర్ణించే సందర్భాలు, వేదాల్లో ఉన్నాయి. మృతుని నుండి బాధతో సెలవు తీసుకోవటాన్ని వర్ణించే మంత్రాలున్నాయి. ఇవన్నీ, జీవితం మీద ఉన్న ప్రేమను సూచిస్తాయి.

మృతునికి వీడ్కోలు యిచ్చి పంపేటప్పుడు, పరలోక ప్రయాణంలో, అతనికి అవసరమయ్యే శరీరాన్ని, వస్తువులను, భోజనాదికాలను ఇవ్వటం మృతునికీ, బ్రతికి ఉన్నవారికీ, మధ్య ఒక హద్దును ఏర్పాటు చేయటం, అతడు వెళ్లవలసిన మార్గాన్ని నిర్దేశించటం, (వైతరణీదాన ప్రయోగం) వగైరా ఏర్పాట్లు చేయటం కనిపిస్తోంది. ఈ విశ్వాసాలు, విధులూ భిన్నభిన్నాలుగా ఉన్నా, అన్ని మాతాల్లోనూ మూలంలో ఉన్న ఈ భావన మాత్రం, కనిపిస్తోంది. మృతుడు మంచి చోటుకు పోవాలనీ, సుఖాన్ని పొందాలనీ, ఆత్మశాంతిని పొందాలనీ, ఆవిధంగా వెళ్లటానికై జీవించియున్న అతని సంతానం, బంధువులు, తగిన

ఏర్పాట్లు చేయాలనీ అంతా విశ్వసిస్తున్నారు. ఇందుకై, వారు చేసే ఏర్పాట్లు, ఆచరించే విధానాలు, దేశాన్ని బట్టి, మతాన్ని బట్టి, కాలాన్ని బట్టి మారవచ్చు.

మృతుని శరీరాన్ని అగ్ని సంస్కారాదులతో పవిత్రం చేసి, పుణ్య లోకాలకు, పితృలోకానికి వెళ్లేందుకు వీలుగా సంస్కరిస్తారు. అతని ప్రయాణం ఏలోటూ లేకుండా సాగటానికై గోదానాది అనేక దానాలు చేస్తారు. (ఋ.వే.16-14-16,18) వీటిగూర్చిన వివరాలన్నీ తరువాత వస్తాయి.

## 6. దహన ఖననాదులెందుకు?

**చావగా మిగిలియున్నవారి ఆరోగ్యసుఖాలకోసం:** బ్రతికియున్నట్టివారి శారీరక సుఖశాంతులకోసం కొన్నివిధులు ఏర్పాటైనాయి. మృతశరీరం ఎక్కువకాలం నిలవవుండక క్రుళ్లిపోతుంది. క్రుళ్లిపోయిన వస్తువులను పారవేయటం ఆచారం. అట్లాగే బ్రతికిఉన్నవారి ఆరోగ్యానికి, సుఖజీవవానికీ, భంగకరమైన మృతశరీరాన్నికూడా, పారవేయాలి. అయితే, దుమ్ము ధూళిలాగా, క్రుళ్లిన కూరగాయల్లాగా, బయటకు విసరివేయలేము. ఆశరీరంతో ఉండిన స్నేహసంబంధమే ఇందుకు కారణం. కాబట్టే, గౌరవాదరాలతో, దానిని దూరం చేస్తున్నాము పాతిపెడుతున్నాము లేదా దహనం చేస్తున్నాము. అట్లా చేయకపోతే, క్రుళ్లిన శరీరదుర్గంధంతో, ఇంటిలోనివారి జీవితం దుర్భరమౌతుంది. కాబట్టి, ఏ విధంగానైనా, మృతశరీరవిసర్జనం తప్పదు. ఇందుకు, అనేక పద్ధతులు, ఆచరణలో ఉన్నాయి. వాటినిగూర్చి తరువాత తెలుసుకొందాం.

## 7. మృతశరీరానికి చేసే సంస్కార విధులు:

మృతశరీరంమీద ఎంతటి ప్రేమాభిమానాలున్నా, మమకారం, మోహం ఉన్నా, ఎంతజాగ్రత్తగా పెంచి పోషించినదైనా, దానిని ఎక్కువకాలం ఇంట్లో ఉంచితే, బ్రతికిఉన్న ఇంట్లోవారికీ, సంఘానికీకూడా ప్రమాదం. కాబట్టి, సాధ్యమైనంత త్వరలో దానిని నశింపచేయాలి. అయితే ఆదిమకాలంలో వేద

పూర్వకాలంలో, శవాలను ఏమి చేసేవారు? అనే విషయమై స్పష్టంగా తెలియదు. మన ఊహనుబట్టి, చచ్చిన జంతువులాగానే, దూరంగా, ఏమరుభూమిలోనో, పారవేసేవారేమో ! లేదా ఏనదీప్రవాహంలోనైనా, వదలివేసేవారేమో! అదే అప్పటికి, అందుబాటులో ఉన్న పద్ధతి అయి ఉండాలి. ఎందుచేతనంటే, ఆస్థితి తరువాత ఎంతోకాలానికిగాని, అగ్నిని ఉపయోగించటం మానవునికి తెలియలేదు. చరిత్రకాలానికి పూర్వం మాత్రం శవాలను మట్టిలో పూడ్చి పెట్టటం (ఖననం) జరిగేదని తెలుస్తోంది. ఆ పద్ధతి ఈనాటికీ చాలాజాతుల్లో, దేశాల్లో ఆచరణలో ఉంది. ఆకాలంలో దహనపద్ధతి ఉన్నట్లు కనిపించదు.

ఋగ్వేదకాలంలో దహనపద్ధతి ఉన్నట్లు కనిపిస్తోంది. ఋగ్వేదంలోని 10-16-1 నుండి 4 ఋక్కులవరకు ఉన్న మంత్రాలనుబట్టి అగ్నిసంస్కారం కూడా ఉన్నట్లు తెలుస్తోంది-

("మైన మగ్నేవిదహో...."10-16-1 (శుతం యదా కరసి జాతవేదో....10-16-2 అనే మంత్రాలు, పైన ఉదహరింపబడ్డాయి. 10-16-3,4 మంత్రాలు తరువాత వేరొక సందర్భంలో ఉదహరింప బడతాయి.)

అట్లాగే అథర్వవేదం 18-2-14లోని" యే నిఖాతా యేపరీస్తా యే దగ్ధా యేచోద్ధితా...."అనే మంత్రాలను బట్టి తెలుస్తోంది.

శవానికిచేసే సంస్కారాలు, ప్రజల ధార్మిక విశ్వాసాలనుబట్టి మారుతుంది. వైదికసూక్తాల్లో ఉదహరింపబడిన జనులు, చాలా ఉన్నత, ఉత్తమ సంస్కారాలు కలవారు. కాబట్టి, వారిది ఆటవికపద్ధతులుకావు. ఈవిషయం. మనకు ఋగ్వేదసంహితలోని, అంత్యేష్టి మంత్రాలనుబట్టి తెలుస్తుంది.

ఆకాలంలో పరివారానికి సంబంధించిన ఆస్తిమీద చనిపోయేదాకా తండ్రికే అధికారం ఉండినట్లు, (ఆస్తిని పంచమని కొడుకు పట్టుబట్టేవరకు) తండ్రే పుత్రపౌత్రాదులందరినీ పోషించినట్లు, పితరులకు పిండప్రదానాదులు

చేసినట్లు (ఋ.వే.1.-105-3,8-51-2) బట్టి తెలుస్తోంది. ఇది నైతిక కర్తవ్యమేకాదు, ధార్మికకర్తవ్యంకూడా ! వేదకాలంలో అంత్యేష్టిలో శవానికి గుహానిఖాతం ఉన్నట్లు కనపడదు. జలనిఖాతం ఉంటే ఉండి ఉండవచ్చు. (దాసదాసీజనాన్ని జలనిఖాతం చేసినట్లు దాఖలాలున్నాయి. శవానికి సంబంధించిన వారెవరూ లేకపోతే, జలనిఖాతం చేసేవారు. సన్న్యాసులు, విరాగులు, బ్రహ్మవేత్తలు, సిద్ధులు, అంటురోగాలుకలవారినీ జలనిఖాతం చేయటం ఉన్నది.)

**8. అగ్నిసంస్కారం- దాని ప్రత్యేకతలు :**

1) హిందూసమాజంలో పూర్వంనుండే ఈ పద్ధతి ఉంది. అగ్నిదేవుడు, ఏపదార్థాన్నైనా (ఆజ్యాదిఆహుతుల్ని) ఎవరిని ఉద్దేశించి యిచ్చారో, వారికి అందజేసే ఉత్తమవాహకుడనే విశ్వాసం ఉంది. యజ్ఞయాగాదులన్నీ, ఆవిశ్వాసంమీదనే ఆధారపడిఉన్నాయి. కాబట్టి. ప్రేతను స్వర్గలోకానికి తీసికొనిపోయేందుకు అగ్నిదేవుడే తగిన వాహకుడు అని తలచటం.

2) సంచారజాతులుగా ఉన్నప్పుడు శత్రువులకు, దుష్టమృగాలకు తమ బంధుశవాలు చిక్కకుండా ఉండటంకోసం దహనం చేసి ఉంటారు.

3) ప్రేతత్వ విముక్తికోసం ప్రేతయొక్క శరీరం (కోట) అగ్నిద్వారా భస్మమైపోతుంది. కాబట్టి వేరొక జీవుడు ఆ శరీరంలోకి ప్రవేశించటానికి వీలులేకుండా దహనం చేస్తారు. అగ్నికి భయపడిన వేరొకప్రేత దానిలో ప్రేశించటానికి అవకాశం ఉండదు. చనిపోయిన శరీరాల్లో ప్రవేశించి కథలు అన్ని సాహిత్యాలలోనూ కొల్లలుగా ఉన్నాయి.

4) మృతుని స్వర్గానికి చేర్చాలంటే, క్రొత్తదేహం కావాలి. పాతదేహాన్ని దహింపజేసి, క్రొత్తదైన జ్యోతిశ్శరీరాన్నియిచ్చి స్వర్గానికి పంపటం; ఇది అగ్నివల్లనే సాధ్యం.

"వహ్నిం యశసం విధథస్య కేతుం సుప్రావ్యం దూతం నద్యోఅర్థమ్ ద్విజన్మానాంరయిమివ ప్రశస్తం రాతిం భరద్భృగవే మాతరిశ్వా!" (ఋవే. 1-60-1) ఓ అగ్నీ ! యాగానికి నీవు పతాకవు. హవ్యములను తీసికొనిపోయే

దూతవు. భూమ్యాకాశాలమధ్యపుట్టి కీర్తివహించువాడవు..."సంగచ్ఛస్వ పితృభిః సంయమేనేష్టా పూర్తేన పరమేవ్యోమన్ హిత్వా యాపద్యం పునరస్తమేహి సంగచ్ఛస్వతన్వా సువర్చాః (ఋ.వే. 10-14-8)

ఓ తండ్రీ ! స్వర్గంలో పితృదేవతలను కలిసికొనుము. నీవు లోగడచేసి యున్న శ్రౌతస్మార్తదానఫలంతో వారిని కలిసికొనుము. తరువాత పాపాన్ని వదలి ధ్రియమాణం (ధరింపబడునది) అనే గృహానికి రమ్ము. అచట శోభనదీప్తియుక్తమైన శరీరంతో కలిసికొనుము.

"అపేత వీత విచ సర్పతా తోస్మాఏతం పితరో లోకమక్రన్! ఆహోభిరద్భిరక్తుభిర్వ్యక్తం యమోదదాత్యవసానమస్మై."

(ఇంతకుపూర్వం శ్మశానంలో ఉన్న పిశాచాదులారా! యజమానికి దహనంస్కారంచేసే ఈచోటువదలి దూరంగా పొండు. పితరులంతా ఇపుడు మృతుడైన యజమానికోసం ఈలోకాన్నీ, ఈస్థానాన్నీ వదలిపెట్టి యముని ఆజ్ఞను అనుసరించారు. యముడుకూడా దివారాత్రములతో, అభ్యుక్షణోదకములతో (నీరుచల్లబడిన) శోభితమైన ఈ చోటును మృతుడైన ఈయజమానికి ఇచ్చాడు.)

(ప్రేతశరీరాన్ని మూడుసార్లు శ్మశానికి ప్రదక్షిణచేయించిన పిమ్మట పురోహితుడు ఆప్రదేశాన్ని కొన్నిమంత్రాలతో ప్రోక్షిస్తూ ఈమంత్రాన్నికూడా చదువుతాడు.)

హిందూమతం ఈదహనక్రియను, స్వర్గానికి పోవటానికై తగినట్లుగా ఆత్మను (జీవుని) శరీరంనుండి వేరుచేయజాలిన ప్రక్రియగా భావించటంవల్ల శ్రేష్టమైన కర్మగా భావించింది. 'నైనందహతిపావకః' ఆత్మను అగ్నికాల్చలేదు కాబట్టి శరీరాన్నికాల్చి ఆత్మను వేరుచేస్తుంది. అట్లా దహనంచేయకపోతే, చిరకాల సాహచర్యంవల్ల ఆప్రేతాత్మ ఈ శరీరంచుట్టూ తిరుగుతూ ఉంటుందనే విశ్వాసంతో ఈ దాహకర్మ ఏర్పాటైంది. కొంతమందికి మాత్రం దాహకర్మ నిషిద్ధంగా ఉంది. 1) రెండు సంవత్సరాలోపు పిల్లలు 2) కలరా మొదలైన

అంటురోగాలతో చచ్చినవారు, 3) మిక్కిలి పూజులైనవారు. 4) నవప్రసూతలైన స్త్రీలు 5) గర్భిణి స్త్రీలు 6) సన్యాసులు. బ్రహ్మవేత్తలు మొదలైనవారు. వీరికి దహన సంస్కారం నిషిద్ధం.

## 9. వేదకాలంలోని అంత్యక్రియలు:

వేదకాలంనాటి అంత్యేష్టిక్రియలను గూర్చి ఋగ్వేదం 10,11,19 మండలాలలోను, అధర్వవేదం 18వ కాండలోను ఉన్నాయి. ఆ క్రియలను మనం ఒకచోట ఏర్చిపేర్చి చూస్తే ఈవిధంగా ఉంటాయి.

1) ఏమనిషైనా చనిపోయినట్లు నిర్ధారణ చేయాలంటే అతని చెవివద్ద అతనిని పునర్జీవితుని చేయటానికై కొన్ని మంతాలు చదువుతారు. (ఋ.వే.7.53). దానివల్ల పయోజనం లేకపోతే అంత్యేష్టికర్మలు ఏర్పాటు చేస్తారు. పాణోత్క్రమణానికి ముందే పాయశ్చిత్త విధానం ఉంది. నారాయణ సూక్తపఠనం చేస్తారు. శవానికి తల వెంటుకలు, గడ్డం, మీసం గొరిగిస్తారు. పస్తుతం ర్భలతో చేసినట్లు నటించి మంతాలు చదివి ముగిస్తున్నారు.
2) శవానికి స్నానం చేయిస్తారు (అథ.వే.5-19-4). శవాన్ని బయటకు తీసికొనిపోవటంతోడనే మళ్లీ లోనికిరాకుండా తలుపులు మూసివేస్తారు. (అథ.5-19-12) మరణం సంభవించిన పద్ధతిని బట్టి షణ్ణిమిత్తపాయశ్చిత్తం చేస్తారు. ఊర్ధ్వోచ్ఛిష్ట, అధోచ్ఛిష్ట, అంతరిక్షమరణ, కర్ణమంతరాహిత్య, పర్యుషితశవదాహ ఖట్వాధిరూఢమరణం అస్నానమరణం ఉత్కాంతి ధేనుదానరాహిత్యం తత్కాలదహనరాహిత్యరూపమైనవి.
3) రెండు ఎడ్లను పూన్చినబండిమీద శవం వెంట శోకార్తులైన బంధువులు ఉంటారు. (అథ.8-1-19,9-2-11).
4) శ్మశానంలో శవానికి క్రొత్తవస్త్రం కట్టబెడతారు. (అత.18-2-57).
5) శవంయొక్క ముఖాన్ని ఆవుపేడతో కప్పుతారు. (అథ.18-2-58).
6) శవం చేతినుండి స్వర్ణపిండం ధనుస్సును బాణాదుల్ని లాగేస్తారు. (అ.థ.18-2-59,60), బాహ్మణ క్షతియ వైశ్య శవాలచేతుల్లో వరుసగా ఉండే వస్తువులు స్వర్ణపిండం, ధనుర్బాణములు, మణి.

7) చితిమీద ఒక మూల మృతుని భార్య పడుకుంటుంది (సహగమనం కోసం కాదు.) ఋ.వే. 10-18-7) అథ. 18-3-1,2).

8) ఒక మేకను బలి యిచ్చేవారు. చితిని అంటించేవారు. ఆడవాళ్ల ఏడ్పులు సాగేవి. (అథ. 18-2-4-8).

9) మృతుని శరీరంలోని వేరువేరు అవయవాలను ఆయాచోట్లకు పోవలసినదిగా మంత్రాలను చదువుతారు. (ఋ.వే. 10-16-3).

10) మృతుని ఎముకలను పోగుచేసి పాతిపెట్టటం, కొడొకచో ఆ ఎముకలపై స్మారకాన్ని నిర్మించటం (600-1200) ఇటుకలతో) ఋ.వే. 10-18-11,13).

11) మృతునినుండి సెలవు తీసికొనటం (ఋ.వే. 12-14-7,8)

12) చితాగ్నివల్ల, శవసామీప్యంవల్ల, అశుచియైన శరీరశౌచంకోసం బంధువులు స్నానంచేయటం (అథ. 12-2-40,42).

13) ఇంటిలోని అపవిత్రాగ్నిని దూరంచేసి, పవిత్రాగ్నిని స్థాపించటం (దీపారాధన చేయటం) (అథ. 1262-43,45).

14) అంత్యేష్ఠి తరువాతక్రవ్యాదాగ్నిని (మాంసాన్ని దహించిన అగ్నిని) పారవేయటం (అథ. 12-2-4). ఇంటిలోని మృతునియొక్క యాజ్ఞికాగ్నుల్ని కూడా బయటవేయటం (అథ. 12-2-39).

15) భోజనాలు వగైరా (ఋ. 10-18-3).

ఈ క్రమంలోని విషయాలనుచూస్తే 4 పధానాంశాలు కనిపిస్తున్నాయి. 1. అభిషేచనం 2. శ్మశానచితి 3. ఉదకకర్మ 4. శాంతికర్మ అనేవి. కొన్ని మార్పులతో చేర్పులతో ఇంచుమించుగా ఆ వేదకాలీనవిధులే నేటికీ ఆచరణలో ఉన్నాయి.

**సూతకాలంలో వచ్చిన మార్పులు :**

వేదకాలం తరువాత సూతకాలంనాటికి ఈ కర్మకాండల్లో కొన్ని క్రొత్త విధులు చోటుచేసుకున్నాయి. వేదాల తరువాత ఈ అంత్యేష్టి కార్యకలాపాలను

గూర్చిన వర్ణన కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయ అరణ్యకం ఆరవ అధ్యాయంలో కనిపిస్తుంది. ఇందులో పితృమేధమనే శీర్షికలో శ్రాద్ధం మినహా (11,12 రోజులు చేసే క్రియలుగాక) మిగతా పదిరోజులు జరగాల్సిన కర్మలకోసం అవసరమైన మంతాలు ఉన్నాయి. చాలా ఋక్కులు ఋగ్వేదం నుండి గ్రహింపబడి యథాక్రమంగా కూర్చబడ్డాయి. పత్యేకంగా విధులను మాతం ఉటంకించలేదు - ఏ మంతాలు ఏవిధులకోసం ఉపయోగించాలో చెప్పలేదు.

## మృత్యువు సమీపించటాన్ని గూర్చి :

మరణానంతర విధుల్ని గూర్చి చెప్పినంత విపులంగా, మృత్యువును సమీపించినవాడు చేయాల్సిన విధులను గూర్చి చెప్పిన గ్రంథాలు లేవు. కారణం, మృత్యువు యొక్క రాక ముందుగా తెలియకపోవటం కావచ్చు. అయితే, పాపపుణ్యాలలో, ఇహపరాలలో నమ్మకం ఉన్న హిందువు తన మరణం సమీపిస్తున్నదని తెలియగానే, తన సన్నిహితుల్ని పిలిచి, తన స్థితిని గూర్చి వివరించి వారికి చెప్పవలసినవ్నీ చెవుతాడు. మరణం కాస్త ముందు వెనుకలుగా రావచ్చుగాక! తన ఉత్తరకర్మల్ని గూర్చి, ఆస్తి పంపకాలను గూర్చి తన తదనంతరం మిగిలినవారి జీవనవుటేర్పాట్లను గురించి, ఇంకా తాను చేయవలసియున్న కార్యాలను గూర్చి చెవుతాడు. ఇంకా ధార్మికుడైతే తాను తన చేతిమీదుగానే చేసుకోవలసిన దానధర్మాలు చెవుతాడు. ఇంకా ధార్మికుడైతే తాను తన చేతిమీదుగానే చేసుకోవలసిన దానధర్మాలు చేసుకుంటాడు. అన్నిదానాలలో గోదానం చాలా ముఖ్యమైనదని భావిస్తే తన చేతిమీదుగానే చేసుకుంటాడు. గోవుద్వారానే పాతాళలోకంలోని నదిని దాటి స్వర్గానికి చేరగలుగుతామని హిందువు విశ్వాసం. అందుకే గోవును 'వైతరణి' అని 'అనుస్తరణి' అనీ అన్నారు. పూర్వం ఒక గోవును ఆబోతును అచ్చుపోసి వదిలేవారు. రానురాను, గోవును బలి యివ్వటం వదలిపెట్టటం మానివేసి బాహ్మణునికి

దానం యివ్వటం ఆరంభించారు. అగ్నికిపిమ్మట, బ్రాహ్మణుని పరలోకవాహకునిగా భావించారు. క్రమశః బ్రాహ్మణునికేకాక తమబంధువు

లకు దానం చేయనారంభించారు. గోదానాన్ని మృతుడుకాక, అతనికొడుకో, ఇతరులో అతనిపేరుమీద చేస్తున్నారు.

మృతుని స్వచ్ఛమైన నేలమీద వరుండబెడతారు. మంచంమీద నిషిద్ధం. సమీపంలో త్రేతాగ్నుల్నిగాని, కేవలం గార్హపత్యాగ్నినిగాని సిద్ధంగా ఉంచుతారు. దీపారాధన చేస్తున్నారు. అతని చెవులవద్ద అతనిశాఖకు చెందిన వేద పారాయణ చేస్తారు. లేదా ఉపనిషత్తులుగాని, భగవద్గీతగాని, రామాయణ శ్లోకాలుగాని చదువుతారు.

**10. దహనానికి ముందు చేసే పనులు :**

తైత్తిరీయ ఆరణ్యకంలోనిమంత్రం, మృత్యువుకు సరిగ్గా ముందుగా హోమాన్ని చెవుతోంది. కాని, ఈవిధి జీవితమంతా యాజ్ఞికాగ్నుల్ని సురక్షితంగా కాపాడుతూవచ్చిన కర్మిష్ఠులకే వర్తిస్తుంది.

బౌధాయనుని అభిప్రాయం ప్రకారం, మృతునిచేతితో స్పృశింపజేసిన నేతితో నాలుగు ఆహుతులు గార్హపత్యాగ్నిలో వేయాలి. కాని, భారద్వాజుని అభిప్రాయంప్రకారం ఆ అహుతులు అహవనీయాగ్నిలో వేయాలి అని ఉంది. నాలుగు ఆహుతులా? లేక ఎన్ని అనే విషయం చెప్పలేదు. ఆశ్వలాయనుని అభిప్రాయాన్నిబట్టి ఆ ఆహుతులు వేరొకపద్ధతిలో యివ్వాలి. అయితే, మన మతంలో యజ్ఞపద్ధతి నశించిపోయినకొద్దీ, ఈ ఆహుతులిచ్చే పద్ధతికూడా లుప్తమై పోయింది. ద్విజుల్లో కర్మచేసేవానిచేతమాత్రం కర్మాధికారంకోసం అగ్నిహోత్రం, హోమంచేయిస్తున్నారు. ప్రేతౌపాసన (కర్తచేత) దహనాధికారం సిద్ధ్యర్థం చేయిస్తున్నారు.

మరణాసన్నుడైనవానినోట్లో తులసిజలం, గంగాజలం లాంటివి పోస్తున్నారు. పౌరాణిక పద్ధతుల్లో మృతుని శరీరశుద్ధికోసం చేస్తున్న ఆధునికపద్ధతి ఇది. ఈ పద్ధతి చాలా అర్వాచీనం. ప్రాచీనాధారాలు లేవు.

**పాడె– శవవాహనము :**

గృహ్యసూత్రాల ననుసరించి హోమం తరువాత ఉదుంబరకాష్ఠంతో

(మేడికఱ్ఱలతో) పాడె సిద్ధంచేయాలి. ప్రస్తుతం వెదురుముక్కలతో చేస్తున్నారు. వానిమీద కృష్ణమృగచర్మం పరవాలి. ప్రస్తుతం తాటిఆకులచాప పరుస్తున్నారు. పితృకర్మచేసే కొడుకుగాని, ఇతరబంధువులుగాని, శవానినికి ఉన్న పాత వస్త్రాలను తీసివేయాలి. క్రొత్తవస్త్రాలను కట్టబెట్టాలి. అప్పుడు చదివేమంత్రాలు, భావం."అపైతదహయదిహా- విధః పురా. ఇష్టాపూర్తమనుసంప న్య దక్షిణా యథాతే దత్తాం బహుధా విబంధుమ". ఇప్పటివరకు ధరించిన వస్త్రాలను తీసివెయ్యి. నీవు ఇంతవరకుచేసిన ఇష్టాపూర్తములనూ, బ్రాహ్మణులకు చేసిన ధర్మాలనూ, బంధువులకిచ్చిన బహుమానాలనూ తలచుకో!

మృతుని శరీరాన్ని నాలుగుమూలలూ కలిగి ఉండి, చిరగని, తెల్లని వస్త్రంతో కప్పుతారు. వస్త్రంకప్పేటప్పుడు- ముందుగా ఈ వస్త్రం నీవద్దకు వస్తోంది. అనేమంత్రం మళ్ళీ చెపుతారు. పరలోకానికి పోయేటప్పుడు మృతుడు జీర్ణవస్త్రాన్నివదలి స్వచ్ఛమైన నూతన వస్త్రాన్నిధరించాలి. పిమ్మట పాడెమీద పరుండబెడతారు.

## శవాన్నితీసికొనిపోవటం:

వేరువేరు సూత్రకారులననుసరించి, శవవాహకులుగా వయోవృద్ధులైన సేవకులనుగాని, రెండెడ్లనుపూన్చిన బండిగాని, ఉపయోగించాలి (ఆ.గృసూ.4-1) కొందరు ఒక ఎద్దులాగేబండిని ఉపయోగించాలన్నారు (ఆశ్వలాయనుడు) ఇందుకు వినియోగంలో ఉన్న మంత్రభావం నేను నీపరలోక జీవన వహనంకోసం ఈరెండు ఎద్దులను బండి పూన్చుతున్నాను. దానిపై నీవు పుణ్యాత్ములుండే పుణ్యలోకానికి (యమలోకానికి) వెళ్లవచ్చు. (పార. గృ. సూ.3-43) దీనివల్ల ప్రాచీనకాలంలో శవవాహకులు మనుష్యులు కారనీ తెలుస్తోంది- ముఖ్యంగా పుత్రులు బంధువులుమాత్రం కారు. బ్రాహ్మణుని శవాన్ని బ్రాహ్మణుడు మోయటంలో తప్పులేదనీ, బ్రాహ్మణశవాన్ని అబ్రాహ్మణులు మోయరాదనీ, అట్లాచేస్తే ప్రాయశ్చిత్తం చేయాలనీ మొదలుగా మనుస్మృతి శాసించింది. (మను.5-104) తరువాతి స్మృతికారులు ఈ

విషయంలో బాగా పట్టుదలచూపించారు. (నగరాల్లో ఈనాడు శవవాహకుల రేటు పెరిగిపోయి మోటారువాహనాన్ని ఉపయోగిస్తున్నారు. ఇది మంచి పద్ధతి. పంచాయతీగ్రామాల్లో కూడా ఇటువంటి ఏర్పాటు ఏదైనాచేయటం అవసరం. ప్రభుత్వం, దాతలు ఇందుకు పూనుకోవాలి.)

## 11. శ్మశానానికి తీసికొని పోయే ముందు జరిగే విధులు:

**1) మరణకాలప్రాయశ్చిత్తం :** పుట్టినక్షణంనుండి మరణించేక్షణంవరకు బాల్యయౌవనకౌమారవార్ధకావస్థలలో, జాగ్రత్ స్వప్నసుషుప్తులలో, మనోవాక్కాయేంద్రియ వ్యాపారాల్లో రహస్యంగాకానీ, ప్రకాశంగాకానీ, తెలిసి కానీ, తెలియకకానీ చేసిన, సమస్తపాపాలు పోగొట్టుకొనుటకై మృతికాస్నానం కృచ్ఛ్రత్రయం (సువర్ణధాన్య ఆజ్యదానాలుయివ్వటం) అనేక్రియలు మృతుడే చేయాలి. అట్లా చేయలేకపోతే కొడుకు (కర్త) చేస్తాడు.

**2) ఉత్క్రాంతిగోదానం :** సుఖంగా ప్రానోత్క్రమణం జరగటం కోసం గోదానం చేస్తారు. తిలపాత్రదానంకూడా చేస్తారు. ఇట్లా సుఖంగా ప్రాణం పోవటం నిమిత్తమై దశదానాలు చేస్తాడు. (గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడానిచ రౌప్యలవణం ఇత్యాహుః దశదానాః ప్రకీర్తితాః) ఇవి మృతుడే తనచేతులమీదుగా చేసుకోవాలని ఉద్దేశించినవి. ప్రస్తుతం కర్తచేత ఆయాదానవస్తువులకు బదులుగా హిరణ్యం (డబ్బులు) యిప్పిస్తున్నారు.

**3) కర్ణమంత్రపఠనం:** సమస్త పాపక్షయద్వారా శాశ్వతబ్రహ్మలోకావాప్త్యర్థం కర్ణమంత్రపఠసంకరిష్యే- అని సంకల్పంచేసి మృతుని కుడిచెవిలో "బ్రహ్మవిదాప్నోతిపరం, తదేషాభ్యుక్తా----"అనేతైత్తిరీయక ఆనందవల్లి అనువాకాన్ని జపిస్తారు.

**4) షణ్ణిమిత్తప్రాయశ్చితం:** మలమూత్రాదుల విసర్జనానంతరం శుభ్రంచేసుకోక పోవటం, స్నానంచేయకపోవటం, కర్ణమంత్రరాహిత్యం, నిషిద్ధమైన మంచం మొదలైనవాటిమీద చావటం, ఉత్క్రాంతిగోదానాదులు

ఇవ్వకపోవటం, వెంటనే దహనం చేయక నిలవ ఉంచటం- ఆలస్యంకావటం వీటిదోషాలు పోవటంకోసం మళ్లీ కృచ్ఛ్రత్రయం, గోదానం చేయాలి. ప్రత్యామ్నాయంగా హిరణ్యదానం చెప్పారు. తరువాత శవయాత్ర ఆరంభమౌతుంది.

**శవయాత్ర :** శవయాత్రకు నేతృత్వంవహించేవాడు మృతుని జ్యేష్ఠ పుత్రుడు. పుత్రులు లేకపోతే దత్తపుత్రుడు. ఈ విషయంలో అధికారులను స్మృతిగ్రంథాలు విపులంగా చెప్పాయి. ఇతరజ్ఞాతులు, సమీపబంధువులుకూడా అనుసరిస్తారు. శవయాత్రకు నేతృత్వంవహించే పెద్దకొడుకు చేతిలో కాలుతున్నకట్టెను పట్టుకొని నడుస్తాడు. ఆకట్టెను గార్హపత్యాగ్నితో రగుల్కొల్పు తారు. ప్రస్తుతం అగ్నిని కుండలోవేసుకొని జ్యేష్ఠపుత్రుడు నడువగా, అతనివెనుక పాడె, ఆవెనుక చుట్ట పక్కాలు మిత్రులు నడుస్తారు. గృహ్యసూత్రాల ప్రకారం రెండుసంవత్సరాలు దాటిన వారంతా శ్మశానానికి శవంవెంట వెళ్లాలి.- "ద్వివర్షప్రభృతి ప్రేత మాశ్మశానాత్ సర్వ గచ్ఛేయుః" (పా.గృ.3-10-8) శవంవెంటవెళ్లేవారిక్రమం వారి వయస్సునుబట్టి ఉంటుంది. వయోవృద్ధులుముందు, చిన్నవారు వెనుక ఉంటారు. పూర్వ కాలంలో స్త్రీలుకూడా శవం వెంటజుట్టువిరబోసుకొని, దుమ్ముచల్లుకొని, వెళ్లేవారు. మృతుని కనిష్ఠపత్ని వారికి నేతృత్వం వహించేది (అస్యభార్యాః కనిష్ఠప్రథమాః ప్రకీర్ణకేశ్యోప్రజేయః పాంసూనంసేష్వావపమానాః (బో.ప.సూ. 1-4-3) క్రమేపి ఈ స్త్రీలు శ్మశానినాకివెళ్లే ఆచారం పోయింది.

శవయాత్రలో ముందున్నజ్యేష్ఠపుత్రుడు ఈ అర్థంవచ్చే మంత్రాన్ని మాటిమాటికి ఆవృత్తిగా చదువుతాడు- "వెళ్ళవలసిన మార్గం బాగాతెలిసినట్టి, నిన్నుతీసికొనివెళ్లటానికి సుశిక్షితులైన పశువులతోకూడి, లోకరక్షకుడైన పూషుడు ఈలోకంనుండి నిన్ను పితృలోకానికి చేరుస్తున్నాడు. ఓ అగ్నీ! ఇచటినుండి ఏవేవి తీసికొనివెళ్లవలెనో వాటినన్నింటినీ తీసికొనిపో!

అనుస్తరణి, వైతరణి- ప్రాచీనకాలంలో గోవు శవయాత్రలో మిక్కిలి ప్రధానమైన పాత్ర వహించేది. దీనిని, అనుస్తరణి, రాజగవి అనేవారు. ఇందుకై

ప్రత్యేక లక్షణాలుకల ఆవును ఉపయోగించేవారు. దానిని తెచ్చేటప్పుడు – "లోకరక్షకుడా! నీకు దీనిని బలి ఇస్తున్నాను". అనే అర్థంవచ్చే మంత్రం చదువుతూ తెచ్చేవారు. సూత్రకారులు చెప్పినదానినిబట్టి గోవును బలియివ్వాలి. బలియిచ్చేటప్పుడు ఏదైనా విఘ్నం వస్తే, ఆటంకం కలిగితే గోవును విడిచిపెట్టేయాలి. (ఆనయన్త్యేతాం కృష్ణాం కూటాంజరతీం తజ్జఘన్యాం అనుస్తరణీం పదబద్ధాం––––(బో.గృ.సూ. 1–4–1)

బలియిచ్చేటప్పుడు చెప్పే మంత్రార్థం– "మృతుని అనుసరించేదానా! మృతునియొక్క అనంతమైన పాపాలను నీద్వారా పోగొడుతున్నాం. కాబట్టి మాకు పాపంవల్లగాని, వార్థక్యంవల్లగాని, వచ్చేదౌర్బల్యాలు రాకుండుగాక!" అని. గోవును విడిచిపెట్టటం తప్పనిసరిఅయితే, దానిచేత చితికి మూడసార్లు మంత్రాలుచదువుతూ ప్రదక్షిణచేయించి, మంత్రాలతో దానిని శుద్ధిచేసి వదిలేవారు. ఆమంత్రార్థం ఇట్లా ఉంటుంది. "నీవు నీ పాలద్వారా నా కులంలోనివారిని, చనిపోయినవారిని, నవజాతశిశువుల్ని, పుట్టబోయేవారిని తృప్తిపరచేసాధనా నివి."అని.

అవును వదలిపెట్టేప్పుడు చదివే వేరొక మంత్రార్థం. "ఈ ఆవురుద్రులకుతల్లి. వసువులకు దుహిత. ఆదిత్యులకు స్వస(సోదరి) మాకు సుఖస్థానం. అందుచేత, అందరికీ బిగ్గరగా చెపుతున్నాను. పవిత్రము, సాధువు అయిన ఈగోవును కొట్టవద్దు. చంపవద్దు. దానిని నీరు త్రాగనీయండి. గడ్డి మేయనీయండి. ఓం దీనిని వదలిపెడుతున్నాను."

గోవధ అనేది ఎప్పుడైనా నిషిద్ధమే! శవదహనానికి పూర్వంగాని, అసమయంలోగాని, గోవును దానం చేయటం మొదలుపెట్టారు. మొదట, శవానికి ఆహారంగా, పాలకోసం అతనివెంట పోవటానికై బలియిచ్చిన ఆవును, తరువాత తరువాత దానంచేయటంద్వారా ఆవిధిని నిర్వర్తించటం ఆరంభమైంది; అని తోస్తోంది.. ఏమైనప్పటికీ, పరలోకయాత్రలో మార్గదర్శనం చేయిస్తూ సహాయపడేది కాబట్టే దానికి అనుస్తరణీ, వైతరణి అనేపేర్లు వచ్చాయి.

మృతుని యింటినుండి శవయాత్ర బయలుదేరేది. 'శ్మశానానికి చేరేలోగా మూడుచోట్ల ఆగుతూ, ప్రతిచోటా కొన్నివిధులాచరిస్తూ, మార్గంలో యమసూక్తాల్ని పఠిస్తూ సాగుతుంది. ఈనాడు యమసూక్తాలకుబదులు రామనామస్మరణ, చేస్తున్నారు. టపాకాయలుపేలుస్తూ రంగునీళ్లుచల్లుకుంటూ వెళ్లేవారుకూడా కనిపిస్తున్నారు.

**12. దహనం:**

శ్మశానానికి చేరినతరువాత, అచట చితిని పేర్చటం వగైరా కార్యకలాపాలను గూర్చి ఆరణ్యకంలో ఏమీ చెప్పలేదు. ఈ పనులన్నీ మంత్రవిహీనంగా జరిగేవి అని తెలుస్తుంది. గృహ్యసూత్రాలు చితిని పేర్చటం వగైరా విధుల్ని చెపుతున్నాయి. తగినచోటు చూడటం, దేవతలకు బలియివ్వటం, వాడవలసిన కట్టెలు, చితికికొలతలు వగైరాలన్నీ చెప్పబడ్డాయి. కొంతమంది సూత్రకారుల అభిప్రాయాన్నిబట్టి మృతుని పొట్టనుచీల్చి, మలాన్నితీసివేసి, ప్రేగుల్లో నేతినినింపి, మళ్లీ దర్భలతోకుట్టి దహనం చేయాలని అన్నారు– "ఆధాస్య దక్షిణం కుక్షిమపావృత్య, నిష్పురీషం కృత్వాద్భిః ప్రక్షాల్య సర్పిషా ఆంత్రాణిపూరయిత్వా దర్భైః సంసీవ్యతి." (బో.పసూ. 2–6) ఇదంతా శవశుద్ధికోసం అయి ఉంటుంది. విదురుల విషయంలో, విధవల విషయంలో కొన్ని ప్రత్యేక విధులున్నాయి. దహన సంస్కారంలో కూడా ఆపస్తంబ, ఆశ్వలానాది వివిధ సూత్రకారుల అభిప్రాయాల్లో భేదాలు కనిపిస్తున్నాయి.

పిమ్మట శవాన్ని చితిమీద ఉంచుతారు. బ్రాహ్మణశవం చేతిలో ఒకబంగారు ముద్దను, క్షత్రియ శవంచేతిలో ధస్సును, వైశ్యశవం చేతిలో మణిని ఉంచుతారు. (ఆ.గృ. సూ.4, బో. పద్ధతి 1–8, 3–5) వైదికకాలంలో, సూత్రకాలంలో ప్రతిదీ నియమానుసారంగా చేసేరోజుల్లో పైనపేర్కొన్న విధంగా ఆవును బలియివ్వటంగాని, వదలివేయటంగాని చేసేవారు.

**13. విధవను చితిపై పరుండ బెట్టటం:**

గృహ్యసూత్రకాలంవరకు మృతునిభార్యను చితిపై పరుండబెట్టే ఆచారం ఉండేది. బోధాయనుని బట్టి మృతుని (శవానికి) ఎడమప్రక్కన అతని

భార్యపడుకోవాలి. ఆశ్వలాయనుడు 'ఉత్తరదిక్కున, తలకుసమీపంలో, చితి ప్రక్కన కూర్చుండాలి' అన్నాడు. పిమ్మట అగ్నిదానంచేసేవాడు ఇట్లాఅంటాడు– 'ఓమర్త్యుడా! నీ భార్య, పరలోకంలో నిన్ను కలుసుకోవటానికై నీశరీరంప్రక్కన పరుండి ఉంది. ఆమె పతివ్రత. పురాణధర్మాన్ని పాలిస్తూవస్తోంది. ఆమెకు ఈ లోకంలో ఉండేందుకు అనుమతిని యివ్వు. నీసంపదను నీవంశస్తులకు వదలివేయుము. (బో.ప.1–8, 3–5)

మృతునితమ్ముడు, లేదా శిష్యుడు లేదా సేవకుడు చితివద్దకుపోయి ఆమె ఎడమచేతిని పట్టుకొని– 'ఓనారీ! లెమ్ము! ఈ ప్రాణంలేనివానివద్ద పడిఉన్నావు. ఈశవాన్ని వదలి లెమ్ము! జీవలోకంలోకిపో! నీ పాణిగ్రహణంచేసేవానిని, నిన్నువివాహం చేసుకోదలచినవానిని (హస్తగ్రాభస్య, దిధిషోః) వివాహంచేసుకో (అ.ప.గృ.సూ.4–24) దిధిషువు= మారుమనువు చేసుకొనేవాడు.)

ఈ సందర్భంలో ఈ ఆచారాన్ని గూర్చి చెప్పే ఋక్కులు (ఋగ్వేదం 10–18–8,9)లోను, అధర్వవేదం 18–3–1,2) అంత్యేష్టి సూక్తాల్లో కనిపిస్తు న్నాయి. పూర్వకాలంలో మృతునివస్తువులు అతనితోపాటే పాతిపెట్టటమో, తగులబెట్టటమో చేసేవారు. ఈ వస్తువుల్లో దుస్తులు, భోజనపాత్రలు, అస్త్రశస్త్రాలు, ఇంటిపశువులు మొదలైనవి ఉండేవి. అధర్వవేదంలో దీనిని పురాణధర్మం అనీ, ప్రాచీనాచారం అనీ అన్నారు. ధర్మం పురాణమనుపాల యంతీ– (అధ.వే.18–3–1) ఈ పద్ధతి ఋగ్వేదకాలంలో లేదు. భార్య ప్రక్కన పరుండ బెట్టడం, కేవలం ఔపచారికమే తప్ప, మరేమీకాదు. ఈ ఆచారం ఈనాటికి దేశంలో కొన్నిచోట్ల ఉంది (సహగమనంకోసంకాదు) గృహ్యసూత్ర కాలంలో కూడా, విధవను శవంతోపాటు దహనంచేయటంలేదు. రానురాను, పద్ధతుల్లో, ప్రయోగాల్లో స్త్రీని శ్మశానానికి తీసికొనిపోవటం, ఆడవాళ్లు శ్మశానానికి పోవటంకూడా తొలగించేశారు. (కాని, దీని భ్రష్టరూపం సహగమనం పేర వ్యాప్తమై ఆరాజపుత్రుల్లో మిగిలి ఉండి 1835 లో విలియంబెంటిక్, రాజారామమోహనరాయలు మొదలైనవారి ప్రయత్నాలతో ఈదురాచారనిషేధశాసనంద్వారా నిర్మూలింపబడేవరకు సాగింది).

పిమ్మట, శవంవద్దనుండి అతనిభార్య లేచివచ్చేటప్పుడు అతని చేతిలోని స్వర్ణపిండాన్ని (లేదాధనుస్సును, మణిని) తీసికొనిరమ్మని ఆమెతో చెపుతారు. "బ్రాహ్మణస్త్రీలాగా ధనగౌరవాదులు, శక్తి సౌందర్యాదుల వృద్ధికోసం మృతుని చేతిలోని స్వర్ణపిండాన్ని తీసికొనిరా! నీవీలోకంలో బ్రతికి ఉండు. మనం ఇక్కడ సుసేవితులమై, సమృద్ధితో, మనపై దండెత్తిన వారిపై విజయం పొందుతూ ఉందాం" (ఆప.గృ.సూ.4-1-2) ఆశ్వలాయనగృహ్యసూత్ర టీకాకారుడు, చితినుండి విధవను తీసికొనివచ్చేవాడు. ఈ మాటలు అంటూ స్వర్ణపిండాన్ని తేవాలి అని అంటాడు. ఇది సముచితంగానే తోస్తుంది. అయితే ఆరణ్యక, సూత్రరచనాకాలంనాడు జీవించియున్న భార్యను మృతునిప్రక్కన పరుండబెట్టే ఆచారంలేదు.

యాజ్ఞికవిధుల్ని జీవితాంతం యథావిధిగా ఆచరించినట్టి మృతుడు ఉపయోగించిన యజ్ఞపాత్రలను అతనితోపాటే శరీరంమీద అక్కడక్కడ ఉంచి తగులబెట్టేవారు. ఆవును వదలివేస్తే, పిండితో ఆవునుచేసి మృతునితోపాటు దహనం చేసేవారు. పరలోకంలో అతనికి ఉపయోగించే వస్తువులన్నింటినీ దహనంచేసేవారు. తరువాతకాలంలో ఈ పద్ధతిపోయి,బ్రాహ్మణునికి దానం యివ్వటం రూపంలో మృతునికి అందిస్తున్నారు. అగ్నిలాగా, బ్రాహ్మణుడుకూడా ఉత్తమపరలోక వాహకుడుగా గుర్తింపబడ్డాడు కాబట్టి!

**14. దహన సంస్కారం ఒకయజ్ఞం:**

ఈ ఆరంభకక్రియలన్నీ పూర్తి అయినపిమ్మట దహనక్రియ ఆరంభమౌతుంది. దీనిని ఆహవనీయాగ్నిలో వేసిన ఆహుతిగా పరిగణిస్తారు. కాబట్టి, యజ్ఞంలో వేసిన ఆహుతినిలాగా (అగ్నియే) శవాన్ని స్వర్గానికి చేరుస్తుందని నమ్మకం. (అప.గృ.సూ.4-12, భా.గృ. చా.1-2) చితిని అంటించటానికి రంగం సిద్ధంకాగానే ఈ విధమైన ప్రార్థనచేస్తూ అగ్నిని అంటిస్తారు.'ఓ అగ్నీ! ఈ శరీరాన్ని నీవు భస్మంచేయకు స్వర్గానికి చేర్చాలి కాబట్టి కష్టపెట్టకు. దీని అవయవాలను చర్మాన్నీ, చెల్లాచెదరు చేయకు. ఈ శవం పూర్తిగాధ్వస్తమైన పిమ్మట స్వర్గలోకానికి తీసికొనిపో! (ఋ.వే.10-16-1, "మైనమగ్నే విదహో......")

పిమ్మట మృతుని విభిన్న అవయవాలను సంబోధించి ఈవిధంగా అంటారు.- (అథ.వే. 18-27) సూర్యం చక్షుర్గచ్ఛకు వాతమాత్మా ద్యాం చ గచ్ఛ పృథివీం చ ధర్మణా। అపోవాగచ్ఛ యది తత్ర తే హితమోషధీషుప్రతితిష్ఠా శరీరైః ఆజోభాగస్తపసా తం తపస్వ తం తే శోచిస్తపతు తం తేఅర్చిః యాస్తే శివాస్తన్వోజాతవేదస్తాభిర్వహైనం సుకృతాము లోకం (ఋ.వే. 10-16-3,4) "ఓప్రేతుడా! నీనేత్రాలు సూర్యుని పొంది మంచికాంతితో వెలుగొందుగాక! నీప్రాణం బాహ్యవాయువును చేరి గొప్పతృప్తిని పొందుగాక! నీపుణ్యకర్మల్ని-బట్టి నీవు స్వర్గం, పృథివి, జలలోకాలకు ఎక్కడికిపోయినా అవి నీకు కల్యాణ-ప్రదములు అవుతాయి. అక్కడ నీకు ఆహారం లభిస్తుంది. శరీరంతో అక్కడ నివసించు."

ఈ విధంగా, మృతునికి వీడ్కోలుచెప్పేదృశ్యం హృదయవిదారకంగా ఉంటుంది. సూత్రకాలంలో ఇంట్లో యజమాని రక్షిస్తూవస్తూన్న అగ్నులతో మూడుచోట్ల ఈశవాన్ని అంటించేవారు (గార్హపత్య ఆహవనీయదక్షిణాగ్నులతో) ముందుగా ఏ అగ్ని మృతునిశరీరానికి తాకుతుందో దానినిబట్టి అతడు ఏలోకానికి పోతాడో భవిష్యద్వాణి చెప్పేవారు; తర్కవితర్కాలు చేసేవారు-దేవలోకానికా? పితృలోకానికా? లేక ఇతరలోకానికా? అని (అథ.గృ.సూ. 4-2,3,4) ఈనాడు గృహస్థు పురోహితుడూకూడా (తాకికాగ్నులైన చుట్ట బీడి సిగరెట్టు తప్ప) అగ్నిహోత్రాలే చేయటంలేదుకాబట్టి ఆప్రశ్నే ఉదయించదు.

తరువాత శవంవెంట వెళ్లినవారంతా వెనుదిరిగి అటూ ఇటూ చూడకుండా తలలువంచి తిరిగివస్తారు- ఒకరినొకరు ఓదార్చుకుంటూ, మృతునిపొగడుతూ, వైరాగ్యవచనాలు వల్లిస్తూ!" అతిగా అశ్రుపాతంచేస్తే, అవి మృతుని దగ్ధంచేస్తాయి'

అని ఋగ్వేదం 8-86లోనూ స్వర్గచ్యుతుడౌతాడని రామాయణాదుల్లోనూ చెప్పబడ్డది- 'శోచమానాస్తు సస్నేహా బాంధవా సహృదయస్తథా పాతయతి జనం స్వర్గాదశ్రుపాతేన రాఘవ' అని. అంతా స్నానాలుచేసి యింటికివస్తారు. అంతకుముందే మృతుని పరుండబెట్టినచోట ప్రదీప్తంచేసి

ఉంచిన దీపాన్నిచూస్తారు. మరణస్థలంలో జలకుంభ ప్రతిష్ఠాపనచేస్తారు. ప్రేతకు తాపోపశమనార్థం, క్షుత్పిపాసోపశమనార్థం జలకుంభంనుండి సంతతధారగా నీరు పడేటట్లు అమరుస్తారు.

15. అస్థి సంచయనం:

ఇది మరునాడు జరిగే కర్మ. ఇది శవాన్ని పాతిపెట్టే పాచీన పద్ధతికి అవశేషంగా మిగిలివున్న ఆచారంగా కనిపిస్తుంది. శవదాహం అయినచోట మిగిలివ ఉన్న అస్థికలను నీటితో కడిగి పోగుచేసి ఒక పాతలో ఉంచి దానిని నదిలో వదలివేయటం జరుగుతుంది. కొందరు భూమిలో పాతిపెట్టి దానిపై స్మృతిచిహ్నం ఏర్పాటు చేస్తారు. కొందరు రెండూ చేస్తారు. కొందరు సమీపాన ఉన్న జలాశయంలో కొన్ని కలిపి, కొన్నిటిని దాచి తీసికొనిపోయి గంగానదిలాంటి పుణ్యనదుల్లో కలుపుతారు. వారి వారి విశ్వాసాన్ని బట్టి పలురకాలుగా చేస్తూ ఉంటారు.

ఈ అస్థిసంచయనం జరగాల్సినరోజును గురించి సూతకారుల్లో భిన్న అభిపాయాలున్నాయి. పదిరోజుల్లోగా మంచిరోజుచూచి కొందరు చేస్తున్నారు. లోధాయనుడు 3, 5, 7వ రోజుల్లో చెయ్యమన్నాడు. 2,4,6,8 రోజున కొందరు చెప్పారు. 1,4రోజుల్లో చేస్తే మంచిరోజు చూడనక్కరలేదన్నారు. అశ్వలాయనుడు 13వరోజున అన్నాడు. ఎవరు ఏరోజున చేసినా పుణ్యనదిలో కలపటం అనేది సామాన్యంగా చేస్తున్న పని. పదవరోజులోగా కలపాలి కాబట్టి, కాలక్రమేణా సూతకారులు ఆయారోజుల్లోకూడా చేయవచ్చునని అంగీకరించినట్లు తెలుస్తోంది.

తరువాత జరుగవలసిన కార్యక్రమం నిత్యకర్మ ఆరంభించటం. దానిని గురించి చెప్పేముందు అశౌచాన్ని గురించి చెప్పివేస్తే క్రమం సరిగా ఉంటుంది.

అశౌచం : మృతుడు చనిపోయిననాటినుండి పుత్రపౌతులకు జ్ఞాతులకు కొంతమంది బంధువులకు అశౌచం (మైల) విధించారు. అంటే, వారు

ఇతరులను తాకటం, ఇతరులు వారిని తాకటం నిషిద్ధం అన్నమాట. నియమితకాలం వరకు వారు, వారు ఉపయోగించే వస్తువులు ఇతరులకు దూరంగా ఉండాలి. దీనికి కారణం ఏమిటి? అంటే.

మృతుడు చాలాకాలం రోగంతో బాధపడి ఉండవచ్చు. కలరా, మశూచిలాంటి అంటురోగాలతో చనిపోయి ఉండవచ్చు. కోడుకు, భార్య లాంటివారు, సమీప బంధులు అతనికి పరిచర్య చేస్తూ ఉండినందున, ఆయారోగజీవులు వీరిని కూడా ఆశ్రయించవచ్చు. రోగజీవాణువులు, రోగం రూపంలో వ్యక్తం కావటానికి 10,15రోజులు పట్టవచ్చు. వేపమందలు తప్ప రూగజీవులను నాశనం చేయజాలిన 15రోజులాపటు సంఘానికి దూరంగా ఉంచి, పిమ్మట స్నానాదికాదులతో శుద్ధిచేసి, సంఘంలో కలువుకొనే ఆచారం అయి ఉండవచ్చు.

మృతుడు సాంక్రామికరోగాలతో బాధపడకపోయినా, అల్పవ్యవధిలోనే మృతుడైనా, శవం అనేది మృత్యువాహకం అనే భయంతో అశౌచాన్ని విధించి ఉండవచ్చు. పాణం పోయే సమయానికి మృతుని చాలా అవయవాలు శిథిలమైపోయి (పక్షవాతాదులవల్ల) క్రుళ్ళిపోయే స్థితిలో ఉండవచ్చు. పాణంపోయిన 7,8 గంటలనుండి క్రమంగా కుళ్ళి, రోగజీవులకు ఆశ్రయం అవుతుంది. అందుచేతకూడా అశౌచం విదించారని అనుకోవాలి. వైగా పూర్వకంలో మృతుని జ్ఞాతులంతా, అతని యింటిపేరువారంతా ఒకే గ్రామంలో ఉండటంవల్లను, రాకపోకలు అధికంగా ఉండటంవల్లన, జ్ఞాతులందరికీ అశౌచం విధించారు. కాని ఈనాడు విజవాడలో చనిపోయిన వ్యక్తియొక్క బొంబాయిలోనున్న బంధువుకు (జ్ఞాతికి) అశౌచం విధించటంలో ఔచిత్యం కనిపించదు. మన సమాజంలో దేశకాలాల్నిబట్టి, చుట్టరికాన్నిబట్టి, కులాన్నిబట్టి, జాతినిబట్టి, వయస్సునుబట్టి, లింగాన్నిబట్టి, ఉపనయనాది సంస్కారాలనుబట్టి అశౌచం పాటించాల్సిన గడువును (కాలనిర్ణయాన్ని) విధించారు. ధర్మశాస్త్రాల్లో ఈ అశౌచాన్ని గూర్చిన పత్యేక పకరణమే ఉంది. ఈనాడు గొప్ప నాయకులు చనిపోయినప్పుడు దేశానికో రాష్టానికో

కొన్నిదానలపాటు దుఃఖదినాలుగా పరిగణిస్తున్నారు. అశౌచాన్ని కూడా ఆవిధంగా దుఃఖసూచకదినాలుగా పరిగణించవచ్చు.

గృహ్యసూత్రాలననుసరించి బ్రాహ్మక్షత్రియులకు 10 రోజులు, వైశ్యులకు 15 రోజులు శూద్రులకు నెలరోజులు అశౌచం విధింపబడ్డది. (పార.గృ. సూ.3- 10.30, 38) విధ్యుక్తంగా అగ్నిహోత్రాలుచేస్తూ, స్వాధ్యాయం చేసేవానికి ఒకరోజులోను, కేవలస్వాధ్యాయపరునికి మూడురోజుల్లోనూ అశౌచ నివృత్తినిచెప్పి, ఈ రెండులేనివానికి 10 రోజులకు శుద్ధి అని పారాశరస్మృతి 3-4లో

"ఏకాహాచ్ఛుధ్యతే విప్రో యోగ్నివేదసమన్వితః
త్ర్యహాత్కేవలవేదస్తు నిర్గుణోదశభిర్దినైః" అన్నారు.

తరువాతిస్మృతులు ప్రత్యేకపరిస్థితుల్లో అశౌచంనుండి పూర్తిగా విముక్తిని కలిగిస్తున్నాయి. ఋత్విజుడు, యజ్ఞదీక్షితుడు, యాజ్ఞికకర్మలు చేసేవాడు, దీర్ఘసత్రయాగం చేసేవాడు, బ్రహ్మచారి, బ్రహ్మవేత్త, శిల్పి, కర్మకారులు, వైద్యుడు, దాసీజనం, నాపిత(మంగలి) రాజు, శ్రోత్రియుడు, వీరందరికీ తత్కాలశౌచం అన్నారు.

ఋత్విజాం దీక్షితానాం చ యజ్ఞియం కర్మకుర్వతాం
సత్రవ్రతి బ్రహ్మచారి దాతృబ్రహ్మవిదాం తథా (యజ్ఞవల్యస్మృతి 3-28)
కారవః శిల్పినోవైద్యాః దాసీదాసాశ్చ నాపితాః
రాజానః శ్రోత్రియాశ్చైన సద్యశ్శౌచః ప్రకీర్తితాః (పారా.స్మృతి.3-21, 22)

అట్లాగే ఒకవ్యక్తి చనిపోయిన యింటిని కొంతకాలంపాటు పాడు పెడతారు. ఆయింటిని మూసివేసి ఉంచుతారు, ఉపయోగించరు. పాడు పెట్టవలసిన కాలాన్ని వ్యక్తి చనిపోయిన తిథి, నక్షత్ర వారదుల్నిబట్టి నిర్ణయిస్తారు. ఆ అవధి తీరిన తరువాత శుద్ధిచేసి వాడుకుంటారు.

## 16. మరణ పైతృకాలకు దుష్టతిథి వారనక్షత్రాదులు:

ఈ అవకాశం చూచుకొని ఈపితృమేధంలో జ్యోతిశ్శాస్త్రం చోటు చేసుకుంది. మరణానికి మంచిచెడురోజులను నక్షత్రాలను నిర్ణయించింది– చావటం మనచేతుల్లో లేకపోయినా పండితవచనాలు తెలుసుకోవటం మంచిదిగదా! మృతికి మంచినక్షత్రాలు– అశ్వని, భరణి, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్రేష, పూర్వాఫల్గుణి, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, శ్రవణం, ఇవన్నీ ప్రేతకార్యాలకు మంచివి. వీటిలో కొన్నింటిని అంగీకరించని శాస్త్రకారులూ ఉన్నారు.

వారాల్లో– శుక్ర, మంగళ, ఆదివారాలు, ప్రేతకార్యాలకు మంచివికావు. తిథులు:–1,2,7,11,12, 13,14 ప్రేతకార్యాలు పనికిరావు.

ఇల్లుపాదు పెట్టే విషయంలో –మృగశిర, చిత్త, ధనిష్ట ఈ నక్షత్రాలు ద్విపాదనక్షత్రాలు. వీటిలో మరణిస్తే 3 నెలలు పాదుపెట్టవలే. కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ,ఉత్తరాషాఢ ఈ త్రిపాదనక్షత్రాల్లో మరణిస్తే 4 నెలలు పాదుపెట్టాలి.

ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి. ఇవి ధనిష్ఠాపంచకం ఈ నక్షత్రాల్లో మరణిస్తే 6 నెలలు పాదుపెట్టాలి.

1,6,11 నందతిథులు నంద, రిక్త తిథుల్లోమరణిస్తే ధాన్యదానం
4,9,14 రిక్త తిధులు
2,7-12 భద్రతిథులు భద్రతిథుల్లో మరణిస్తే భూదానం

ఆది, మంగళ, శుక్ర, శనివారాల్లో మరణిస్తే– వస్త్రదానం ద్విపాది త్రిపాదినక్షత్రాల్లో మరణిస్తే– హిరణ్యదానం

ధనిష్ఠాపంచకములో మరణిస్తే– కాంస్యదానం

డబ్బు, ఓపిక ఉండాలే తప్ప ఇటువంటి విధులు, ప్రాయశ్చిత్తాలు శాస్త్రాల్లో కొల్లలుగా చెప్పబడ్డాయి. ఇవి చెప్పేవారి లోటూలేదు. ఇన్ని

కర్మకాండలు చేసినా, ఇంకా ఆప్రేతాత్మ ఆయింటినీ, గదినీ వదలి వెళ్లదనేనమ్మకమే ఇట్లా ఇంటిని పాడు- పెట్టటానికి కారణం. ఇదికూడా ప్రాంతీయ జాతికులభేదాలను బట్టి రకరకాలుగా ఉంది. అడగకపోయినా వచ్చి పాడుపెట్టాలని చెప్పే సిద్ధాంతులూ, మనస్సులో అనుమాన బీజాలనునాటే బంధువులు అమ్మలక్కలు కొల్లలుగా ఉన్నారు. సంచయనం పిమ్మట నిత్యకర్మలు ఆరంభమౌతాయి.

("భస్మాంతగ్ం శరీరం "(యజు.40 అ. 15) భస్మంచేయటమే శరీరానికి అంతిమసంస్కారం.)

నిషేకాది శ్మశానాంతో మంత్రైః యస్యోదితో విధిః (మను.2-16) శరీరానికి మొదటి సంస్కారం గర్భాదానం అయితే, చివరి సంస్కారం శ్మశానం (భస్మంచేయటం) నిజానికి ఇంతటితో మానవుని సంస్కారవిధులు అన్నీ ఆగిపోవాలి. కాని, దశరాత్ర, ఏకాదశాహ, ద్వాదశాహ సపిండీకరణ, మాసిక, అబ్దికాది క్రియలు చాలా జరుగుతున్నాయి. స్మృతులు గరుడ పురాణాదులు, గృహ్యాసూత్రాలు, పద్ధతిప్రయోగగ్రంథాలు, వగైరాలవల్ల రకరకాలుగా విశ్వాసాలు పెరగటంతో, కర్మకాండ కూడా పెరిగింది. నిత్యకర్మలు- దశరాత్ర, ఏకాదశహ, ద్వాదశాహ, సంపిండీకరణ, మాసిక, ఆబ్దిక, గయాశ్రాద్ధాది క్రియలన్నీ వేదాల్లో లేవుకాబట్టి, పౌరాణిక సంస్కారాలు కాబట్టి విధులు కావు అని కొందరంటారు. ఆర్యసమాజం వారి అభిప్రాయం ఇదే!)

## 17. నగ్నశ్రాద్ధం:

"ప్రేతస్య మరణ దినాదారభ్య ప్రధమేహని అంధత్వ మూకత్వ కాణత్వ బధిరత్వ పిశాచత్వ నివృత్యర్థం ప్రధమేహనికర్తవ్య నగ్నప్రచ్ఛాదనాద్యైకోద్దిష్ట ఆమశ్రాద్ధం.....అద్యకరిష్యే" అని సంకల్పం చేసి, ఆమపార్వణవిధానంలో ద్రవ్యరూపంలో చేస్తారు. నగ్నశ్రాద్ధం తరువాతనే సంచయనం చేస్తారు. బియ్యం, వస్త్రం, ఉదకుంభం, కాంస్యపాత్ర పప్పులు, గోధుమలు, దూదిపరుపు, మంచం, వెండి, ఇనుము, కంబళి వగైరా సమస్త సామగ్రి

పుష్కలంగా దానం యిస్తారు. ఒక సంవత్సరానికి సరిపడిన భోజనసామగ్రి దానం యివ్వాలని చెపుతారు. అభావపరిస్థితుల్లో ప్రత్యామ్నాయంగా హిరణ్యం ఉండనే ఉన్నది.

## 18. నవాహ్నిక శ్రాద్ధాలు:

1,3,5,7,9 రోజుల్లో క్రిందటిరోజులతో కలిపి (1,2,3 రోజులకు 3వరోజున, 4,5రోజులకు 5వరోజున, 6,7 రోజులకు 7వ రోజున, 8,9 రోజులకు 9వ రోజున) చేస్తారు. వీటినే ఆహ్నికాలు ఇవ్వటం అంటారు. బియ్యం, కూరలు, పప్పులు, వంటసామగ్రి, నెయ్యి, నూనె, చెంబు, వగైరాలు దానంగా యిస్తారు. ప్రేతతృప్తికోసం, ప్రేతతృప్తిద్వారా ప్రేతత్వ విముక్త్యర్థం... అని సంకల్పంచెప్పి యిస్తారు.

ఈ నవాహ్నికశ్రాద్ధాలు మొత్తంకలిపి తొమ్మిదవ రోజున ఒకసారే చేసే పద్ధతికూడా ఉంది. ఆశ్వలాయనుడు నవశ్రాద్ధాలు తొమ్మిది అని అన్నాడు. ఆపస్తంబుడు ఆరు అన్నాడు. కొన్నిశాఖలవారు అయిదు అంటారు. ఇవన్నీ అమశ్రాద్ధాలు. అంటే పిండితోచేసేవి. అన్నశ్రాద్ధాలు కావు. అన్నం బదులుగా బ్రాహ్మణులకు భోజన పదార్థాలు ఇస్తారు. డబ్బు ఇస్తారు. కొందరు వీటిని స్వయంపాకుమని, పొత్తర్లు అనీ అంటారు. ఇవన్నీ నిత్యకర్మతోపాటు మధ్యలో జరుగుతాయి కాబట్టి ముందుగా చెప్పాము. ఇక నిత్మకర్మనుగూర్చి తెలుసుకుందాం. ఒకశిలలో ప్రేతను ఆవాహనచేస్తారు. దహనజనిత తాపతృష్ణాపిపాసాక్షుదు. వశాంతికోసం ఆశిలకు (ప్రేతకు) స్నాన మృత్తికాస్నాన వాదసోదక, తిలోదక పిండప్రదానాదులు నిర్వరిస్తారు. ఇది పదిరోజులపాటు జరిగే నిత్యకర్మ.

## 19. నిత్యకర్మ:

పరలోకంలోకూడా కర్మఫలానుభవంకోసం శరీరం కావాలి. ఇహలోకంలో కర్మఫలానుభవంకోసం వచ్చిన శరీరం, మాతృగర్భంలో

పదినెలలపాటు క్రమంగా అవయవనిర్మాణం జరిగి, పెరిగి జన్మిస్తోంది. అట్లాగే పరలోకానుభవంకోసం అవసరమైన శరీరం కూడా తొమ్మిది రోజులపాటు వివిధ అవయవనిర్మాణాదులతో పూర్తి అయ్యేటట్లు, నిత్యకర్మలు ఏర్పాటు చేసినట్లుతోస్తుంది. పిండము అనే పదాన్ని శ్రాద్ధకర్మల్లో శరీరమనే అర్థంలో వాడతారు. జననమయ్యేంతవరకు గర్భస్థ శిశువును కూడా, పిండమనే అంటారు. పిండదానం అనే కర్మ వరుసగా 12 రోజులు జరుగుతుంది.

## పుట్టుపూర్వోత్తరాలు:

వైదికయుగంలో పిండదానంలో పాల్గొనవలసిందిగా పితరులను ఆహ్వానించినట్లు ఋగ్వేదం 10–5 మండలంలోని 15వ సూక్తంలో విపులంగా వర్ణితమైంది. అయితే, ఇందులో వ్యక్తిగతంగా ఆహ్వానించినట్లు కనపడదు– సామూహికాహ్వానమే! సత్రాల్లో విధిపూర్వకంగా ఇటువంటి ఆమంత్రణం కనిపిస్తోంది. మొదటిరోజునుండి మృతునికి పిండదానం చేయాలి. పిండాలన్ని బియ్యపుపిండితో శుద్ధికోసం నీటినికలిపి చేస్తారు. ఇది శరీరావయవ పూరకం అని విశ్వాసం. "పిండమవయవపూరకం దత్వా" (పా.గృ. సూ. 3–10,2) వేదాల్లోను, ఉపనిషత్తుల్లోను, శరీరం అన్నంతో తయారౌతోందని చెప్పబడ్డది– 'అన్నాత్పురుషః అన్నీ అన్నమయకోశం వగైరా) మృతుని పేరు పెట్టి పిలిచి పిండదానం చేస్తారు.

నిత్యకర్మలో ప్రతిరోజూ జరిగే అవయవనిర్మాణం – "ప్రథమేహని యః పిండస్తేన మూర్ధా ప్రజాయతే ద్వితీయేన తు కర్ణాక్షినాసికాశ్చ సమాగతాః గళాం సభుజవక్షాంసి తృతీయేన యథాక్రమం జానుజంఘేతథాపాదౌ చతుర్థేన తుసర్వదా నాభిస్థానం గుదం లింగం పంచమేన తు సర్వదా సర్వ మర్మాణి షష్ఠేనసప్తమేన తు నాళయః దంతలోమాన్యష్టమేన వీర్యంతు శనవమేన తు" అంత్యేష్టి విషయకమైన పద్ధతుల్లో ఈ సంస్కారభాగం బాగా వికసించింది. మొదటిరోజున క్షుధను, తృషను (ఆకలిదప్పికల్ని) తృప్తిపరచటానకీ, భావిశరీరంలో రక్తనాళాల నిర్మాణంకోసం ఒకపిండంయిచ్చి జలపాత్ర ఇతర

ఖాద్యపదార్థాలు యిస్తారు. ఆసనానికి కుశలు, లేపం, పుష్పం, సుగంధద్రవ్యాలు దీపం వగైరాలు యిస్తారు. (అ.గృ.సూ. 4.5) రెండవరోజున మృతునికి శ్రవణనేత్ర, ఘ్రాణనిర్మాణం కోసం పిందదానం చేస్తారు. మూడవరోజు, మెడ, మూపు, బాహువులు, వక్షఃస్థలం, నిర్మాణకోసం, ఇట్లా తొమ్మిదిరోజులు వివిధ అవయవాలనిర్మాణం కోసం పిండదానం చేస్తారు.

## 20. దశాహం :

పదవరోజుతో నిత్యకర్మ పూర్తి అవుతుంది. శిలాభాండోద్వాసనం, తిలామలకస్నానం, ప్రేతయొక్క భార్యకు కంఠ, సూత్ర విసర్జనం, చనిపోయినది సువాసిని అయితే చేటలదానం ఈరోజున జరిగే పనులు. పదవరోజున జ్ఞాతులు, బంధువులు, మిత్రులు వస్తారు. క్షురకర్మచేయించుకొని, స్నానంచేసి, మృతునికి ప్రేతత్వవిముక్తికోసం తర్పణలు ఇస్తారు. ఈ తర్పణలనే ధర్మోదకాలు అంటారు. ఈ నిత్యకర్మలన్నీ ఏనదిబడ్డునో, జలాశయంవద్దనో ఇంటికి దూరంగా జరుగుతాయి.

(ఈ పదిరోజులూ ఇంటివద్ద బ్రాహ్మణులకు దానంచేయటంద్వారా మృతునికి భోజనపదార్థాలు, ఇతరవస్తువులు,చెంబు, పీట వగైరాలు యివ్వటం ఆచారం. ఆహ్నికాలు, నగ్నము అనేపేర్లతో ఈ దానాలు జరుగుతాయి. వీటిని లోగడ ఉదహరించాము. యమలోకం (పితృలోకం) చేరటానికి ఒకసంవత్సరం కాలం పడుతుందనీ, కాబట్టి సంవత్సరానికి సరిపడిన ఆహారపదార్థాలు, చెప్పులు, చెంబు, గొడుగు వగైరా పదార్థాలు దానం చేయాలంటారు) పదకొండవరోజున పిండోదకదానాలతోపాటు గోవృషోత్సర్జనం చేసే ఆచారం కొన్నిచోట్ల ఉంది.

## 21. ఏకాదశాహం :

దీనితో బంధువులకు ఆశౌచనివృత్తి అవుతుంది. ప్రేతన రుద్రలోకావాప్త్యర్థం వృషోత్సర్జనం, గోవృషోత్సర్జనం చేసి వదులుతారు. (ఆచోతును అచ్చుపోసి వదలటం) వృషభసూక్తపఠనం, గోసూక్తపఠనం,

వృషోత్సర్జనహోమం చేస్తారు. ఏకోద్దిష్టశ్రాద్ధం చేస్తారు. బ్రాహ్మణాభావం అయితే అగ్నిలో హోమంచేస్తారు.

## 22. ద్వాదశాహం :

**సపిండీకరణం:** ప్రేతను (మృతుని) తన పితరులతో జోడించటాన్నే-కలపటాన్నే సపిండీకరణం అంటారు. సపిండుడు అంటే జ్ఞాతి- సమాన పిండము (శరీరం) కలవాడు అని అర్థం. ఈ సపిండీకరణం పంద్రెండవ రోజున చేస్తారు. మూడు పక్షాలకుపిమ్మట, సంవత్సరాంతంలోనూ చేసే ఆచారంకూడా ఉంది. యాజ్ఞికాగ్నులను చేస్తూ ఉండేవారికోసం 12వరోజున, మిగతా రెండూ ఇతరులకోసం ఉద్దేశింపబడ్డాయి. ఎందుకైనా మంచిదని మూడు విధాలుగానూ చేస్తూ ఉంటారు. అంతవరకు ప్రేతరూపంలోనున్న మృతునికి మాత్రమే పిండప్రధానాలు చేస్తారు. ఈ సపిండీకరణంద్వారా మృతుని పితృలోకానికి చేరుస్తారు. అతడు పితరులతో కలుస్తారు. ఈ సందర్భంలో గోదాన దశదాన, షోడశమహాదానాదులు చేస్తారు. ఆనాటి నుండి మృతుని ముత్తాత (చతుర్థపురుషుడు) స్వర్గానికి పోతాడు. అతనికి స్వర్గపాథేయం (స్వర్గానికిదారిబత్తెం) యిస్తారు. అంతవరకు మృతుడుచేసిన ఆబ్దికాదుల్లో మృతుని తండ్రి స్థానం మృతునికి వస్తుంది- ఇక కర్త అతని కొడుకు కాబట్టి! దీనిని షోడశశ్రాద్ధం అంటారు. సపిండీకరణవిధులు పూర్తికాగానే కర్త, ఆతనిభార్య స్నానంచేస్తారు. అంతటితో వారి ఆశౌచం ముగుస్తుంది. ప్రతినెల పెట్టవలసిన మాసికము ఆరంభమౌ తుంది.

ఒక సంవత్సరంపాటు ప్రతినెల మాసికం అనే శ్రాద్ధకర్మ చేస్తారు. సంవత్సరాంతంలో మూడురోజులు, (మాసికము (సంవత్సరీకము) (సంపిడీకరణం) ఆబ్దికము అనే శ్రాద్ధకర్మలు చేస్తారు. ఆపైన ప్రతిసంవత్సరం ఆబ్దికం పెడతాడు.

## 23. దహన, శ్రాద్ధములకు మినహాయింపులు:

పాతిపెట్టటం (నిఖాతం) దంతాలురానిశిశువులను, ఉత్తరాధికారులు లేని భిక్షుకులను, బ్రహ్మవేత్తలను, సన్న్యాసులను దహనం చేయకుండా

భూమిలో పాతిపెడతారు. లేదా జలనిఖాతం చేస్తారు. ఉపనయనంకాని బాలురకు, వివాహంకాని కన్యలకు పితృమేధం (శ్రాద్ధకర్మలు) లేవని బౌధాయన పితృసూత్రాలు 3-6-1) చెపుతున్నాయి. వారిని పాతిపెట్టాలి. లేదా జలనిఖాతం చేయాలి. చాలమంది పితృసూత్రకారుల అభిప్రాయం ఇదే!

బౌధాయనుని ప్రకారం గర్భిణీస్త్రీలకు మామూలు గానే అగ్ని సంస్కారం చేయాలి. దీనివల్ల ప్రజననశుద్ధి, రజోశుద్ధి జరుగుతుంది. ప్రాజాపత్యాహుతులిచ్చి, వస్త్రంతో శరీరాన్నికప్పి అగ్ని సంస్కారం చేయాలి.

పరివ్రాజకులు, సన్న్యాసులు, వానప్రస్థులు, వీరంతా బ్రహ్మసాయుజ్యాన్ని పొందినవారు, బ్రహ్మవేత్తలు. కాబట్టి పితృలోకం వారి గమ్యంకాదు. ఇటువంటివారి అంత్యేష్టిని గురించిన విషయం బ్రహ్మమేధమనే పేరుతో తైత్తిరీయారణ్యకం 3-లో ఉంది. సన్న్యాసులకు దేహోత్తరక్రియలు నిషిద్ధాలు.

ఆత్మహత్యలు, ప్రమాదాలు, విషంవల్ల, ఉరివల్ల, జలంవల్ల ఇతర ప్రమాదాలవల్ల మరణించిన వారు పితృలోకగమనానికి అనర్హులు కాబట్టి ప్రాయశ్చిత్తంచేసి, పిమ్మట మామూలుగా దహనసంస్కారాలు చేయాలి.

పతితులకు అంత్యేష్టిలేదు. మనుప్రకారం, ప్రతిలోమవివాహంవల్ల పుట్టినవారు ఆత్మహత్యలు చేసుకొన్నవారు, పాఖండులు, వ్యభిచారిణులు, గర్భపాతం చేసుకున్నవారు, భర్తను ద్వేషించేవారు పతితులు. యాజ్ఞ్యవల్క్యస్మృతి సైతం అట్లాగే అన్నది.

**24. సారాంశం :**

ఇంతవరకు చదివినదానిని బట్టి మనకు ఈదిగువ విషయాలు తెలుస్తున్నాయి

1. 'భస్మాంతగ్ం శరీరమ్' (యజు. 40.అ.15) భస్మంచేయటమే శరీరానికి అంతిమసంస్కారం అనీ. "నిషేకాది శ్మశానాంతో మంత్రైః యస్యోదితో విధిః (మనుస్మృతి-2-16) శరీరానికి మొదటి సంస్కారం గర్భాధానంకాగా భస్మంచేయటమే చివరి సంస్కారం.

(ఖననం చేయటంకంటె భస్మంచేయటం సంఘకల్యాణపరంగా, ఆరోగ్యరీత్యా) మంచిది, నగారాలలో పట్టణాలలో ఈనాడు ఖననానికి తగినచోట్లులేక, నగరమధ్యంలో ఖననవాటికలు ఆక్రమించి, క్రొత్తగా ఖననం చేయటానికి వెళ్లేవారికి ఎముకలు క్రుళ్లిన శవాలు దర్శనమిస్తున్నాయి. నేడిది సాంఘిక సమస్యగామారింది, కాబట్టి ప్రభుత్వము, విజ్ఞులు ఆలోచించాల్సిన విషయం. దీనిని రాజకీయంగా, మతవిశ్వాసపరంగా కాక సాంఘిక సమస్యగా గుర్తించాల్సిన అవసరం ఉన్నది.

2. దహనంతరువాత ఇతరసంస్కార విధులున్నట్లు వేదాల్లో కనిపించదు.

3. సూత్రరచనాకాలంలోను, పద్ధతిప్రయోగగ్రంథాలు వెలువడిన కాలంలోను కర్మకాండ పెరిగింది.

4. పరలోకవాహకుడుగా అగ్నిని భావించి చేసే క్రియలన్నీ, క్రమంగా దానగ్రహీతను వాహకునిగా తలచి చేసే దానాలుగా మారినాయి.

5. అనేకవిషయాల్లో ప్రాచీనధర్మగ్రంథాలను, ధర్మ సూత్రాలను అతిక్రమించి నడుచుకుంటున్నమనం, కొన్ని విషయాల్లోమాత్రం మూర్ఖత్వాన్ని ప్రదర్శిస్తున్నాం. మార్పుకు అంగీకరించటంలేదు. (సముద్రయానం, విదేశగమనం, హుణవిద్యాభ్యాసం, ఉపనయనాది సంస్కారాలను అతిక్రమించటం, వివాహవిధుల్లో అనేకమార్పులు, మతాంతర వివాహాలు వగైరా విషయాల్లో మనయిష్టంవచ్చినట్లు నడుస్తున్నాం.) మన ఆలోచనలు, వేషభాషలు, ప్రవర్తనతీరుతెన్నులు అన్నీ కలగాపులగంగా తయారైనాయి. అమెరికానుండి 30 సం॥వయస్సులో పెండ్లికోసం ఇండియావచ్చి అమ్మ నాన్న బేరంచేసి ఉంచిన కన్యను వివాహమాడటానికై, సూటు, టైతో ఉపనయనానికి కుర్చీలోకూర్చుండి, అదే వేషంతో తండ్రి గాయత్రీ ఉపదేశంచేస్తూ ఉంటే చూచేవారికి ఎంతముచ్చటగా ఉంటుందో! అట్లాగే, తల్లిదండ్రులకర్మకాండలకై, ఏసౌదీ అరేబితయానుండో దహనంచేసిన మూడురోజులకు వచ్చే పుత్రుల్ని చూస్తున్నాం, వారు చేసే కర్మకాండలను

చూస్తున్నాం! శాస్త్రరీత్యా వారికి కర్మాధికారం ఉన్నదా? అని ఆలోచించటంలేదు.

6. పౌరాణికవిధులు, ఆచారాలు అనేకం ఎవరి అనుకూల్యాన్నిబట్టి వారు ఈ సంస్కారాల్లో చేర్చారు అని తెలుస్తోంది.

7. బ్రహ్మవేత్తలకు, సన్యాసులకు, మోక్షాన్ని కోరేవారికీ ప్రత్యాబ్దికాదులు అక్కరలేదు. పితృలోకప్రాప్తి కర్మల ఆశయంకాగా, మోక్షప్రాప్తికి కర్మల అగత్యంలేదు.

8. వివాహాది శుభకార్యాల్లో ఆడంబరాలకు, విందులకు, వినోదాలకు అధికాధికంగా ఖర్చులై, సామాన్యులకు భరింపలేనిభారంగా తయారైనట్లే అంత్యేష్టి క్రియాకలాపాలకు సైతం కనీసం 20,30 వేలు ఖర్చు అవుతోంది. ఉద్యోగాలవల్ల తీరికలేకపోవటం, అంగబలం, అర్థబలం లేకపోవటం, నగరాల్లోలాగానే పల్లెల్లో సైతం, పూర్వంలాగా సహకారం అందించే బంధుమిత్రాదులు కరువైపోవటం, శ్రద్ధాభక్తులు నన్నగిలి, లోకంకోసం మ్రొక్కుబడిగా చేస్తున్న ఈత తంగం తగ్గించుకోవటం చాలా అవసరం అని తోస్తోంది. ఇందుకై ఒకపద్ధతిని (వేదవిహితకర్మలకు లోపంలేకుండా మధ్యలో వచ్చిన తతంగాలను తీసివేసి) సూచించాలని అనుకున్నాం. ఆయాకాలాలలో, సూత్రకారులంతా ఇట్లాగే శాసించారు. కాబట్టి ఇందులో తప్పులేదు.

## 25. పరిమితం కావలసిన విధులు- సూచనలు:

ఈ అంత్యేష్టిని నరమేధము, పురుషమేధము, నరయాగము, శ్మశాన విధి, అపరకర్మ, శవదహనం, అనే పేర్లతో వ్యవహరిస్తారు.

తైత్తిరీయ నారాయణప్రశ్నలో 80 అనువాకం ఆత్మయజ్ఞంగా చెప్పబడ్డది. ఛాందోగ్యోపనిషత్తులో (అ.3.ఖం.16) పురుషయజ్ఞం అనే పేరుతో మోక్షార్థులైన జ్ఞానుల ఆచరణను వర్ణించారు.

ముఖ్యంగా మనం తెలుసుకొనవలసిన విషయం:-

మన పూర్వజన్మలో మనం చేసుకొన్న కర్మల్నిబట్టి, ఆకర్మల ఫలాన్ని అనుభవించటానికై మనకీశరీరం (జన్మ) లభించింది. అన్ని జీవజంతువుల విషయంలోనూ ఇదే అన్వయిస్తుంది. మనం ఈ జన్మలో చేస్తున్న కర్మలఫలాన్ని అనుభవించటానికై తగినశరీరం ఉత్తరజన్మలో లభిస్తుంది. అంతేతప్ప, కొడుకులు చేసే కర్మలవల్లకాదు. అన్నిమతాలు అంగీకరించే విషయమేయిది! శరీరానికి మాత్రమే మృత్యువు ఉంది. జీవాత్మకు లేదు. చనిపోయిన తరువాత– ఈ శరీరాన్ని వదలివేసిన తరువాత– జీవునికి ఇక బంధువులతోగాని, జీవించియున్న ఇతరులతోగానీ సంబంధం ఉండదు. కర్మక్షయం అయితే ఇక జన్మ ఉండదు. అదే మోక్షం. అదే అందరికీ పరమావధి. కర్మక్షయం ఎవరికివారు చేసుకోవాల్సినపని. శరీరంతో మరణించిన జీవుడు యమాలయానికి వెడతాడని వేదాలు చెపుతున్నాయి. యమాలయాన్ని అంతరిక్షమనీ, వాయులోకం అనీ అంటారు. యముడు అనే పదానికి గరుడపురాణాదుల్లో చెప్పబడినట్లుగా జీవుని పాపపుణ్యాలకుతగిన శిక్షవిధించే భయంకరరూపుడనే అర్థంకాదు. యమశబ్దానికి ఋతువు ఈశ్వరుడు, అగ్ని, వాయువు, విద్యుత్తు, సూర్యుడు, పరమేశ్వరుడు అనే అర్థాలు ఉన్నాయి. యమాలయానికి జీవుడు పోతాడంటే, వాయులోకానికి, లేదా అంతరిక్షానికి పోతాడని గ్రహించాలి. పరలోకంలో జీవునియొక్క కర్మఫలభోగానికై మనం సత్యకర్మలద్వారా శరీరావయవాల్ని సృష్టిస్తున్నామంటే, అంతకుమించిన హాస్యాస్పదమైన విషయం వేరొకటి ఉండదు. ఏ లోకంలో, ఏరూపంలో, ఏవిధమైన శరీరంతో కర్మఫలాన్ని అనుభవించాలో ఆజీవుని కర్మల్నిబట్టి ఆపరమాత్మయే నిర్ణయిస్తాడు. ఉత్తరజన్మవిషయంలో కూడా ఈ సూత్రమే వర్తిస్తుంది. కాబట్టి మృతునికి మనం చేసే కార్యక్రమం ఈ విధంగా ఉండటం సమంజసం అనిపిస్తుంది.

1) వైద్యవిజ్ఞానశాస్త్రాల అభివృద్ధి రోజురోజుకు అమితవేగంతో జరుగుతున్న ఈ రోజుల్లో మృతశరీరావయవాలు సైతం పూర్తిగా వ్యర్థం కావు. నేత్రదానం చేయటానికి మృతుడుగాని, బంధువులుగాని అంగీకరించి ఉంటే వెంటనే అట్టివైద్యులకు కబురుచేసి తగిన ఏర్పాట్లు చేయటం. ఈ పని వెంటనే

1,2,గంటల్లో జరగాలి. శవాన్ని స్పృశించటం, శవంమీదపడి ఏడవటం పనికిరాదు. శవం అపవిత్రమేకాదు, అనారోగ్యకరం కూడా! రోగజీవవాహకం అని గ్రహించాలి.

2) శ్మశానస్థలశుద్ధికి, వేదికకు, చితికి, తగిన ఏర్పాట్లుచేయటం. శవాన్ని 7,8 గంటలకంటె ఎక్కువకాలం ఇంట్లో ఉంచటం మంచిదికాదు. క్రుళ్లటం ఆరంభమై సూక్ష్మరోగజీవులకు ఆశ్రయం అవుతుంది. నేడు కొడుకులు, కూతుళ్లు వగైరా సమీపబంధువులు అమెరికాలాంటి విదేశాల్లో, దూరప్రాంతాల్లో ఉంటున్నారు. వారికోసం మంచుగడ్డలమధ్య రోజులతరబడి నిలవ ఉంచటం కూడా మంచిదికాదు. పెద్దకొడుకు కాకపోయినా దగ్గరున్న అర్హులెవరైనా చితిని అంటించవచ్చు. ఈ రోజుల్లో పెద్దపెద్ద నగరాలలో విద్యుచ్ఛక్తిద్వారానే దహనానికి ఏర్పాట్లు ఉన్నాయి. అట్లాగూ చేయవచ్చు.

3) శవానికి సుగంధద్రవ్యాదులు పూసి, స్నానం చేయించటం, తెల్లని నూత్నవస్త్రాలను కప్పటం అగ్ని స్థాపనం. గృహశుద్ధి; తప్పనిసరిగా చేయాలి.

4) పాడెనిర్మాణంకంటె వీలుంటే బండిపై, మోటారు వాహనంపై, రిక్షావగైరాలపై శ్మశానయాత్ర మంచిది. ఈ శ్మశానయాత్రకు ఆడంబరాలు అనవసరం. మృతుని శరీరాన్ని చితిపైకిచేర్చటం (పాదందక్షిణదిక్కుకు, శిరస్సు ఉత్తర దిక్కుకు ఉంచటం) అగ్నిని రగుల్కోల్పటం, ఆజ్యాహుతు లివ్వటం. లేదా విద్యుత్తుకొలిమిలో భస్మంచేయటం.

5) శవాన్ని ఇంటినుండి తీసికొనివెళ్లినపిమ్మట, ఇంటిని, ముఖ్యంగా శవం ఉండినగదిని డెట్టాల్, ఫెనాయిల్‌లాంటి క్రిమిసంహారక మందులు కలిపిన నీటితో గోడలను, నేలను శుభ్రంగా కడగటం, సాంబ్రాణి ధూపంవేయటం, పిమ్మట దీపారాధన చేయటం.

6) దహనంకాగానే శవంవెంటవెళ్లినవారు డెట్టాల్‌వంటి క్రిమిసంహారక మందులు కలిపిన నీటితో, సబ్బులతో స్నానంచేయటం. తిన్నగా ఇంటికి రావటం.

7) మరునాడు అస్థిసంచయనం, శ్మశానస్థలశుద్ధి చేయటం అస్థికలను నదిలో, జలాశయంలో కలపటం లేదా పాతిపెట్టడం.

8) మృతుని కర్మఫలాన్నిబట్టి అతనికి పునర్జన్మ, పరలోకభోగాదులు, ఉంటాయని అన్నిమత(గ్రంథాలూ చెపుతున్నాయి. మనం చేసే కర్మలు, అతని కర్మఫలాన్ని పెంచలేవు, తగ్గించలేవు. పురర్జన్మవిషయం కూడా అంతే! కాబట్టి నిత్యకర్మాదులు ఈ విధంగా ఉండటం సముచితంగా ఉంటుంది.

9) ప్రతిరోజు ఉదయం స్నానాదులాచరించి శుద్ధులై, మృతునియింట దేవతా గృహంలోనో, గదిలోనో, మృతుని పుత్రకళత్రమిత్రబంధు వర్గం అంతా సమావేశమై 15 నిముషాలపాటు జీవుని కైవల్యప్రాప్తికై పరమాత్మను ప్రార్థించటం (మౌనధ్యానరూపంలో) పిమ్మట 30 నిముషాలసేపు అర్థంతోసహా ఉపనిషత్పఠనం– ప్రవచనం:– లేదా భగవద్గీతలాంటి గ్రంథపఠనం చేయాలి. పరామర్శించటానికివచ్చే బంధుమిత్రులంతా ఈ సమావేశంలోనే పాల్గొనాలి. విడివిడిగా వచ్చి ప్రత్యేకంగా పరామర్శించటం తగదు. దీనివల్ల– ఉపనిషత్ప్రవచనంవల్ల– మనకు జ్ఞానోదయం అవుతుంది. వైరాగ్యాదులు ఉదయిస్తాయి. జనన మరణాదుల్నిగూర్చిన సత్యం బోధపడుతుంది. సత్ప్రవర్తనతో, నియమబద్ధజీవనం సాగిస్తామని నిర్ణయించుకోవాలి. ఇది మన పరలోకసుఖప్రాప్తి సాధనం అవుతుంది.

10) ఎవరియింద్లకువారు వెళ్లినపిమ్మట, ఒకముద్ద అన్నం భూతబలిగా ఇచ్చిఇంటిలోనివారు భోజనం చేయాలి. ఇట్లా 12 రోజులు వరుసగా చేయాలి. పెద్దలు, గొప్పవారు చనిపోయినప్పుడు సంతాపదినాలను నిర్ణయించినట్లుగా నిర్ణయించాలి. అంతటితో పితృయజ్ఞంసరి. మనకర్మకాండలన్నీ ప్రతీకాత్మకాలు కాబట్టి12 రోజులు 12 నెలలకు ప్రతీకలు.

తమశక్తికొలది మృతునిపేర చేయదలచిన దానాలేమైనా ఉంటే, దేవాలయఅన్నదానపథకాలకు, గ్రంథాలయం, చికిత్సాలయం, పాఠశాలలు, సేవాసంస్థలు మొదలైనవాటికి విరాళరూపంలో ఇవ్వవచ్చు. ఇంతకంటె చేయగలిగిందేమీలేదు. వచ్చినవారికి ఇటువంటి పుస్తకాలను గాని, ఆధ్యాత్మిక గ్రంథాలనుగాని, బహూకరించవచ్చు. అది జ్ఞానదానం అవుతుంది.

ఇంతటితో అంత్యేష్టి (పురుషయజ్ఞం) సరి.

–oOo–